# రాక్షసగ్రహణం

(ఏడు రంగాలుగల రూపకం)

భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

ప్రథమ ముద్రణం
సం 1953–1000

# హెచ్చరిక

కేవలం వినోదం నిమిత్తమైనా సరే, లేక సొమ్ము వసూలు చేసుకొనే నిమిత్తమైనా సరే, ఈ ప్రదర్శనాలలో ఎప్పుడైనా సభ ఎదట ఆడదలచిన ప్రతి సంఘం వారున్నూ ముందుగానే, గ్రంథకర్తకి వ్రాసి లిఖితానుమతి పొందకపోవడం కాపీ రైట్ చట్టప్రకారం ఒక నేరం గనక, ఆ సంగతి గమనించి లిఖితానుమతి పొందిన తరువాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమండ్రి

శ్రీ కొండపల్లి ముద్రాశాల
రాజమండ్రి

వెల
రూపాయి

# రాక్షసగ్రహణం

రంగాల పేర్లు

(1) రాక్షసముద్రిక (2) తంత్రవైఫల్యం (3) కలహానుకరణం (4) భేదోపాయం (5) పారితోషికం (6) ఆవిష్కరణం (7) గ్రహణం

పాత్రలు

చాణక్యుడు—(నందవంశ నాశకుడు, కౌటిల్యుడు, చంద్రగుప్త మంత్రి)
శార్ఙ్గరవుడు—(చాణక్య శిష్యుడు)
నిపుణకుడు—(చాణక్య చారుడు)
సిద్ధార్థకుడు—(చాణక్యానుకూలుడు)
క్షపణకుడు—(చాణక్య మిత్రుడు, జీవసిద్ధి అనే పేరుతో ఎదిరి పక్షంలో ఉన్న జ్యోతిష్కుడు)
చంద్రగుప్తుడు—(మగధదేశ రాజు)
రాక్షసుడు—(నందుల మంత్రి)
శకటదాసు—(రాక్షసుని కార్యదర్శి)
చందనదాసు—(రాక్షసుని ప్రియమిత్రుడు)
విరాధగుప్తుడు—(రాక్షస చారుడు)
ప్రియంవదకుడు—(రాక్షస పరిచారకుడు)
మలయకేతు—(పర్వతకరాజు కొడుకు)
భాగురాయణుడు—(మలయకేతుని ప్రధాని; చాణక్య పక్షపాతి)
భాసురకుడు—(మలయకేతుని పరిచారకుడు)

సంకేతములు: (నటించేవారికి)

RF - కు. ఎ. - కుడిఎదర
RM - కు. మ. - కుడిమధ్య
RB - కు. వె. - కుడివెనక
LF - ఎ. ఎ. - ఎడమఎదర
LM - ఎ. మ. - ఎడమమధ్య
LB - ఎ. వె. - ఎడమవెనక
MF - మ. ఎ. - మధ్యఎదర
MM - మ. మ. - మధ్యమధ్య
MB - మ. వె. - మధ్యవెనక

# రాక్షసగ్రహణం

| పాత్ర : | వచ్చే రంగాలు |
|---|---|
| చా— | 1, 3, 7 |
| శా— | 1 |
| ని— | 1, 3, 6, 7 |
| సి— | 1, 2, 6, 7 |
| క్ష— | 4, 5, 6, 7 |
| చంద్ర— | 3, 7 |
| రా— | 2, 4, 5, 6, 7 |
| శ— | 2, 4 |
| చంద— | 1, 7 |
| వి— | 2, 4 |
| ప్రి— | 2 |
| మ— | 4, 5 |
| భాగు— | 4, 5 |
| భాసు— | 5 |

| రంగం : | | వచ్చే పాత్రలు |
|---|---|---|
| 1. | — | చా, ని, శా, సి, చంద |
| 2. | — | రా, వి, ప్రి, శ, సి |
| 3. | — | ని, చంద్ర, చా, వి |
| 4. | — | మ, భాగు, రా, వి, శ, క్ష |
| 5. | — | మ, భాసు, క్ష, భాగు, సి, రా |
| 6. | — | సి, క్ష, ని, రా |
| 7. | — | సి, చంద, క్ష, రా, చా, చంద్ర, ని |

# రాక్షసగ్రహణం

## ప్రస్తావన

సూత్రధారుడు—(కు. ఎ. నించి ప్రవేశించి ముందుకు వచ్చి) ఒకసారి పార్వతి శివుణ్ణి, మీ నెత్తిమీది కెక్కి కూచున్న ఆ ధన్యజీవి ఎవరండీ? అని అడిగిందట. ఆయన 'చంద్రుడు' అని జవాబు ఇచ్చాడట. నేఅడిగేది ఆ ఆడ మనిషి గురించండీ అందిట పార్వతి. తక్షణం శివుడు గంగా దేవిని తన జటాజూటంలో మాటుపరిచేసి 'అదా నువ్వడిగే ప్రశ్నా! విజయ చెబుతుందిలే నీకుతగ్గ సమాధానం'—అంటూ ప్రయోగించిన టక్కరితనం మిమ్మల్ని రక్షించాలని కోరు తున్నాను.

భూమి కిందికి అణగారిపోకుండా దానిమీద అడుగు తేలికగాఉంచి స్వర్గం పైకి లేచిపోకుండా చేతులు సగమే చాచి సర్వమూ దహించుకు పోకుండా చూపు సగం చేసేసి తాండవంచేసే శివుడు మిమ్మల్ని కాపాడాలని ప్రార్థిస్తున్నాను.

సంస్కృతంలో విశాఖదత్తుడు సృష్టించిన ముద్రారాక్షస నాటకంలో ఉండే కథ ఆంధ్రంలో ఈసభవారి సమక్షంలో ప్రదర్శించి కృతార్థుణ్ణి అవుతాను.

(కు. మ. కి నడిచి నిదానించి) గృహిణీ!

నటి—ఆర్యపుత్ర!

సూ—మనింటో ఈవేళ ఏమన్నా ఉత్సవమా?

న—బ్రాహ్మల్ని పిలిపిస్తేనే!

సూ—ఏమిటికథ !

న—చంద్రగ్రహణంట !

సూ—ఎవరుచెప్పారు ?

న—జనం.

సూ—ఎవరో బాగామోసంచేశారు నిన్ను. చంద్రగ్రహణం......

[ ఎ. ఎ. నించి తెరలో—"ఎవడురా నేనుండగా" అని వినబడుతుంది ]

న—ఏమండీ ! అంతగట్టిగా అరుస్తున్నా డేమిటి ఆయన ఎవడో ! తను భూమిమీదేఉండి ఆకాశంలో చంద్రగ్రహణం జరక్కుండా ఆపేవాడిలాగ !

సూ—ఏమో ! నాకూ తెలియడంలేదు. అతడిచేత మళ్ళీ అనిపిద్దాం ఉండు (గట్టిగా) "చంద్రగ్రహణము"

[ ఎ. ఎ నించి తెరలో—"ఎవడురా నేనుండగా చంద్రగుప్త గ్రహణం చేసేవాడూ !"అని వినబడుతుంది ]

ఓహో ! తెలిసింది ప్రేయసీ ! అతడు చాణక్యుడు. కౌటిల్యుడనికూడా అంటారు ఆయన్ని. తన కోపాగ్నిలో నందవంశాన్ని భస్మంచేశా డాయన. ఈకంఠస్వరం ఆయనదే! 'చంద్రగ్రహణం' అని మనం మాట్లాడుకుంటూ ఉంటే 'మౌర్యవంశంలో చంద్రుడి గ్రహణం' అని ఆయన అన్వయించుగున్నాడు. ఇట్లాపోదాంరా! (అని కు. ఎ. కి పోతారు)

(ఇది ప్రస్తావన)

## రంగం-1

[ఎ. ఎ. నించి చాణక్యుడు ఆలోచనలో ప్రవేశించి, మెల్లిగా ఇటూ అటూ అడుగులు వేసుగుంటూ, నిదానంగా మాట్లాడుకుంటాడు]

చా—ఎవడురా, నేఉండగా చంద్రగుప్త గ్రహణం చేసేవాడూ! నాక్రోధాగ్నిలో నందవంశం ఆహుతి అయి పోయింది. నవనందులూ మసిఅయిపోయారు. నందవంశాన్ని వేళ్ళతోసహా తవ్వి పారేసి ఆ స్థలంలో మౌర్యచంద్రుణ్ణి ప్రతిష్ఠింపించాను. అక్కడితో నాకు కోపంవస్తే ఏంభయమో నాకు దయపుడితే ఏంనయమో బోధపడిపోయింది. ప్రతిజ్ఞ పట్టాను. ప్రతిజ్ఞ చెల్లించుగున్నాను, తీరిపోయింది. కాని, చంద్రగుప్తుడిమీద నాకుగల ప్రేమచొప్పున మళ్ళీ రంగం లోకి దిగవలిసొచ్చింది...ఏమంటే, అవతలపక్షం ఎంత నశించినా, రాక్షసమంత్రి మాత్రం అట్టే ఉండిపోయాడు. అతడు మాస్వాధీనం అవాలిలనుకోవాలిగాని, అతడు మాకు చేజిక్కకుండానే నందవంశ నాశనం అయిపోయిందనీ చంద్ర గుప్త ప్రతిష్ఠాపన జరిగిపోయిందనీ అనుకోడం ఎల్లా? నంద వంశమంటే రాక్షసుడికి అపారమైనభక్తి. నందవంశ లేశుడు ఎవడు మిగిలిఉన్నా, వాణ్ణి ఉద్ధరించి, రాక్షసుడు ఆపక్షాన్ని దెబ్బలాడతాడే కాని, ఆపక్షం త్యజించివచ్చి చంద్రగుప్తుడి పక్షంలోచేరడు. అక్కడికీ, సర్వార్థసిద్ధి నందవంశీయుడు

గనక అతడివల్ల ప్రమాదం కలుగుతుందేమోఅని, అతడు పాపం తపస్సుకని వనవాసంవెళ్ళినా, అతణ్ణి చంపించేశాను. ఆ దెబ్బతో రాక్షసుడికి మరో ఆస్కారం ఏమీ ఉండదను కున్నాను. కాని, రాక్షసుడు ఊరుకోలేదు. చచ్చిపోయిన పర్వతకుడి కొడుకు మలయకేతువున్నాడు. రాక్షసుడు వాణ్ణి పట్టుగుని, వాడికి నందరాజ్యం హస్తగతం అయే ఆశలు కల్పించి, వాణ్ణి లేవదీశాడు. ఔర మంత్రిరాక్షసా! నీ సాటి నువ్వే. అధికారంలోఉన్న ప్రభువుని తాత్కాలిక లాభాల కోసం ఆశించి, సేవచేస్తారు. కష్టాల్లోఉన్న ప్రభువుని భావి లాభాలు ఉద్దేశించి, సేవచేస్తారు. అని ఎరుగుదుం. కాని, చచ్చిపోయిన ప్రభువుయొక్క పపూర్న్నే ఆదుకుని, పూర్వ లాభాలుమాత్రమే స్మరణచేసుగుంటూ, కృతజ్ఞతతో సేవ చేసే నీబోటివ్యక్తి కోటికి ఒకడేనా దొరకడు. కాబట్టి ఇప్పుడు నాయత్నం, నిన్ను ఏ ఉపాయాలవల్లో పట్టి, తెచ్చి, చంద్రగుప్తుడికి మంత్రిగా చేసెయ్యాలని. ప్రజ్ఞ ఏమీలేక భక్తిమాత్రం గల సేవకుడు వ్యర్థుడు. భక్తిఏమీలేక ప్రజ్ఞ మాత్రం గల సేవకుడు ప్రమాదకరుడు. ప్రజ్ఞా భక్తీకుడా గలవాళ్లు సార్థకంగా భృత్యులు, తక్కినవాళ్ళు కేవలం బరువుచేటు. భక్తిప్రజ్ఞాకాకుండా విశ్వాసంకుడా గల రాక్షసుణ్ణి పట్టితీరతాను.

రాక్షసుడు చంద్రగుప్తుడిమీద విషకన్యని ప్రయో గించాడు, ఆ విషకన్యనే సాధనంగా చేసుగుని, ఎదురు

ప్రయోగించేసి, పర్వతకుణ్ణి నేనే చంపించేశాను. చంపించి ఊరుకోక, పర్వతకుణ్ణి చంపించినవాడు రాక్షసుడు అని కింవదంతి పుట్టింపించాను. పర్వతకుడికొడుకు మలయకేతువుని నేను తక్షణం బంధించేస్తే, యధార్థం బట్టబయలు కావచ్చుననే భయంవల్ల, అతణ్ణి బంధించకుండా ఊరుకున్నాను. వాడూ రాక్షసుడితో కలిసిచేసేకుట్ర శ్రుతిమించే ధోరణి కనిపించినప్పుడు వాణ్ణి నొక్కేయచ్చునుగదా, అని నాఎత్తు. మలయకేతువుని నేను వదిలిపెట్టలేదు. అతడిదగ్గర అతడితండ్రికి మిత్రుడనే మిషమీద నాపక్షంవాడైన భాగురాయణుణ్ణి మంత్రిగా కుదురుకునేటట్టు చేశాను. మలయకేతువుతో రహస్యాలోచన చేస్తూండేసమయాల్లో ఏదో తరుణం దొరకపుచ్చుగుని, అతని తండ్రిగారైన పర్వతకుణ్ణి చంపించినవాడు రాక్షసుడుకాడు చాణక్యుడే అనేమాట మెల్లిగా జార్చి జనవాక్యం ఒకలాగూ ఆప్తవాక్యం దానికి విరుద్ధంగానూ ఉండేటట్టుచూసి, తద్వారా మలయకేతువు మతి చెదరగొట్టవలిసిందిగా, భాగురాయణుడితో చెప్పి ఏర్పాటుచేశాను. పైగా పరస్థానాలూ పరభాషలూ పరవేషాలూ పరాచారాలూ బాగా తెలుసుగుని ఉన్నచారుల్ని నియమించి స్వపక్షపరపక్షాలలో రాజభక్తరాజద్వేషుల్ని రహస్యంగా పోల్చుగునేనిమిత్తం కట్టుదిట్టాలు చేశాను. అదీకాక చంద్రగుప్తుడికింద భద్రభటాది అధికారులున్నారు. వాళ్ళంతా చంద్రగుప్తుడికి బాల్యమిత్రులూ కుడిభుజాలూను. వాళ్ళెళ్ళి పర

పక్షంలో చేరి రహస్యతంత్రం సాగించే వీలుకలిగించే నిమిత్తం వాళ్ళందరికీ చంద్రగుప్తుడంటే అసంతృప్తి జనించడంవల్ల వాళ్ళు ఇతడిదగ్గిర మానెయ్యదల్చుగున్నారని ప్రచారం చెయించి వాళ్ళని ఉద్యోగాల్లోంచి తొలిగించి తరిమేశాను. వాళ్ళెళ్ళి అక్కడ చేరారు. ఇంకా చంద్రగుప్తుడి దగ్గిర పరిచారకులుగా ఉండడానికి కాచి ఒడబోసినవాళ్ళనిమాత్రమే నియమించాను. ఇన్నీ ఇల్లాఉండగా నాసహాధ్యాయి ఉన్నాడు ఇందుశర్మ. అతడు శుక్రనీతిపారంగతుడూ జ్యోతిశ్శాస్త్రజ్ఞుడునూ. జీవసిద్ధిఅనే పేరుపెట్టుగుని కుసుమపురం ప్రవేశించి రాక్షసుడితో చెలిమి చేసుగోవలిసిందిగా అతడితో ఖంజాయింపు చేశాను. అతడు నాకు తోడై తీరతాడు. నేను జాగర్త పడంది ఏదీలేదు. చివరకి రాక్షసుడికి సహాయుడుగా ఉన్న శకటదాసుకి తైనాతీగా మాసిద్ధార్థకుణ్ణి తగిలించాను. వాడు శకటదాసుని బుట్టలో వేశాడు. ప్రధానవిషయం చంద్రగుప్తుడు. అత డొక్కడే నడుంకట్టి రంగంలోకి దూకనివాడు. రాజ్యభారం యావత్తూ నామీదే ఉంచుతానంటాడు అతడు. కానీ...... (నెమ్మదిగా ఎ. ఎ. కి నిష్క్రమిస్తాడు)

నిపుణకుడు—(కు. ఎ. నించి ప్రవేశించి) యముడు ప్రాణాలు లాక్కుపోయేరకం. కాని ఈపటంలోఉన్న యముడు నాకుభుక్తిగడిపి నాప్రాణాలు నిలుపుతున్నాడు.

శార్ఙ్గరవుడు—(ఎ. ఎ. నించి వచ్చి చూసి) ఎవరు వారు ? లోపలికి రాకూడదు.

ని—ఈయిల్లు ఎవరిది ?

శా—సుప్రసిద్ధులైన ఆర్యచాణక్యులవారిది.

ని—ఓ అయితే బాగానేఉంది. ఆయన మాకు ధర్మభ్రాత. ఈ యమధర్మరాజు పటంచూపించి ఆయనికి నేను కొన్ని ధర్మాలు ఉపదేశించాలి.

శా—మాగురువులవారికి తెలిసిన ధర్మాల కంటె ఎక్కువగా తెలుసునా ఏమిటి నీకు ?

ని—తెలుసునా అంటే తెలియనూ తెలుసును. అందరికీ అన్నీ తెలియవు. మీగురువుగారికి కొన్ని తెలుసు, నాకు వేరే కొన్ని తెలుసు.

శా—మాగురువుగారు సర్వజ్ఞులు. వారి బిరుదు తస్కరించుగుని పోవడానికి వచ్చావా ఏమిటి ?

ని—ఎందుకో అందుకు వచ్చాను. మీగురువుగారే సర్వజ్ఞులైతే చంద్రుడికి శత్రుత్వం ఎవరితోటో చెప్పమను. కనుక్కురా.

శా—సరే. ఈకాస్తముక్కా తెలిస్తే యెంత, తెలియకపోతే యెంత ?

ని—తెలియడం తెలియకపోవడాల్లో ఉండే సుళువు బలువులు మీగురువుగారికి తెలుసు. చంద్రుడికి శత్రువు పద్మం అనిమాత్రమే సీబోటివాడికి తెలిసేది. ఇంకా ఎవరు శత్రువో తెలుసుగోడంగుడా అవసరమేగా మరీ !

[ఎ. ఎ. కి చాణక్యుడు ఈపాటికేవచ్చి పొంచి
విని తల తిప్పుతాడు ]

శా—చాలుగాని, ఈపాటే దయచెయ్. నీవన్నీ అసంబద్ధాలు.

ని—కాదు బ్రహ్మచారీ. నావన్నీ సుసంబద్ధాలే.

శా—అయితే ఏమిటి, నువ్వనేమాటా?

ని—ఏముందీ? వినడంతో సరికాదు, విని గ్రహించు గోడంకుడా గలవాళ్ళుఉండాలి—అని.

చా—(ఎ. ఎ. నించి వస్తూ) భద్రా. రా. వినడమూ విని గ్రహించుగోవడమూ కుడా గలవాళ్ళని చూస్తుగాని! శార్ఙ్గరవా! నీకేదేనా పనుంటే చూసుకో.

శా—(ఎ. మ. కి నిష్క్రమిస్తాడు)

ని—(నమస్కరిస్తూ)గురుభ్యోనమః! జయం కలగాలి.

చా—(నిపుణకుణ్ణి పరీక్షించిచూసి)జనబాహుళ్యంలో ఎవళ్ళహృదయం ఎల్లాంటిదో పరిశోధించడానికి నిన్ను పంపించానుకాదూ! నీ పేరు నిపుణకుడు? రా, కూర్చో.

ని—చిత్తం. అవునుబాబూ. ఇల్లా నుంచుంటాను.

చా—చెప్పుచెప్పు. ఏమేమి కనిపెట్టావు? చంద్రగుప్తుడంటే జనానికి అనురాగం ఉందా ?

ని—చిత్తం. కాని...

చా—కాని...

ని—ఆ నగరంలో ముగ్గురున్నారండి. ఆముగ్గురూ రాక్షసుడంటే పడిచస్తారు, చంద్రగుప్తుడి పేరుచెబితే ఏడుస్తారు.

చా—(తీవ్రంగా) బతకదల్చుగునే! వాళ్ళపేర్లు?

ని—జీవసిద్ధి ఒకడు. వాడు బౌద్ధుడు. వాడేనండి పూర్వం రాక్షసుడు ప్రయోగించిన విషకన్యని తీసుగొస్తా!

చా—(తనలో) అతడు మా ఇందుశర్మేఅని వీడెరగడుగదా? (పైకి) సరే! వాడిసంగతి చూద్దాం. రెండో వాడు ?

ని—రెండోవాడు శకటదాసు అనే కరణం. వాడు రాక్షసుడికి ఆంతర్యకార్యదర్శి.

చా—(తనలో) వాణ్ణి వెన్నంటే ఉన్నాడుగా సిద్ధార్థకుడూ! (పైకి) సరే. వాడెంత? నిమిషం. మూడో వాడు?

ని—మూడోవాడు చందనదాసు అనే రత్నవ్యాపారి. అతడు మంత్రి రాక్షసుడికి బహిఃప్రాణం. రాక్షసుడి భార్యా పుత్రులు దాక్కునిఉంటా ఆ చందనదాసుగారి ఇంట్లోనే !

చా—(కనుబొమలెత్తి) అలాగా? ఆసంగతి నీకెట్లా తెలుసూ.

ని—(ఉంగరంతీసి) ఈ ఉంగరమూలంగా! (అని ఆ ఉంగరం చాణక్యుడికి ఇస్తాడు.)

చా—(ఉంగరం మీదిముద్ర చూసి) 'రాక్షసుడు' (అని చదివి) రాక్షసుడు మన చేతులో చిక్కాడన్నమాటే! సరి. ఇది ఎట్లా లభించింది నీకు?

ని—ఈయమపటం కల్పించుగుని ముష్టివాడిలాగ కుసుమపురంలో తిరిగానండి. ఒకవీధులో ఒక ఇంట్లోంచి ఓ కుర్రాడు ఇవతలకి రాబోయాడు. వెనకాలే ఒకావిడ పరిగెట్టుకొచ్చి 'వీధులోకి వెళ్ళకూడదురా' అంటూ కేకేస్తూ వాణ్ణి రెక్కపట్టుగుని లోపలికి ఈడ్చేసింది. ఆవిసురులో ఈఉంగరం ఆవిడ వేలుకి చాలా వదులుగా ఉంది గావును, వీధులో వచ్చిపడింది. తక్షణం నేనదితీసి చూస్తినిగదా దానిమీద రాక్షసుడి పేరట ముద్రఉంది. గొప్పమాటే అనుకుని తెచ్చాను.

చా—సరే. సరే. ప్రతిరాత్రి నాకు కనుపించు. పన్లు ఉండగలవ్.

ని—చిత్తం (అని కు. ఎ. కి. నిష్క్రమిస్తాడు)

చా—(ఎ. ము. కి. చూచి) శార్ఙ్గరవా!

శా—(ఎ. ము. నించి వస్తూ) చిత్తం.

చా—చూడూ. మసిపాత్రా పత్రమూతే. రాసుగోవాలి.

శా—(ఎ. ము. కి. వెళ్ళి అవి తెచ్చి అక్కడపెట్టి కుడివేపుచూసి, ఎవరో రాగా చూడడానికా అన్నట్టు వెడతాడు.)

చా—(రాయడం అభినయిస్తూ) ఈరాత్రితో రాక్షసుణ్ణి జయించి........

(కు. ఎ. నించి శార్ఙ్గరవుడు వచ్చి)

శా—పర్వతక రాజుగారి తాలూకు శరీర ఆభరణాలు బ్రాహ్మలకి దానం ఇచ్చెయ్యడానికి చంద్రగుప్తులవారు తమ అంగీకారం పుచ్చుగుని రమ్మన్నారట.

చా—సరే. ఇచ్చెయ్యమను. కాని నేనిప్పుడే పంపిస్తాను కొందరు బ్రాహ్మల్ని. వాళ్ళకే ఇమ్మని చెప్పమన్నారని చెప్పు.

శా—చిత్తం (అని, కు. ఎ. కి. నిష్క్రమిస్తాడు.)

చా—(తనలో) ఈరాత్రితో రాక్షసుణ్ణి జయించి... శార్ఙ్గరవా!

శా—(కు. ఎ. నించి వస్తూ) చిత్తంగురూ!

చా—నువ్వెళ్ళి......

శా—అయ్య......

చా—విశ్వావసుసోదర బ్రాహ్మణుల్ని కలుసుగుని, చంద్రగుప్తులవారు తమకియ్యదల్చుగున్న ఆభరణాలు తమరు ప్రతిగ్రహించి, వచ్చి, మాకు కనపడాలని మనవి—అని చెప్పు.

శా—చిత్తం (అని నిష్క్రమించబోతాడు.)

చా—(కొంచెం ఆలోచించి) మాటమాట! మరో పనిఉంది. ఇదికూడా చేసుగురా! సిద్ధార్థకుణ్ణి కలుసుగో!

శా—చిత్తం.

చా—ఇక్కడ నేను కొంత రాశాను. నారాత గొగ్గిగాఉంటుందే కాని తీరుగాఉండకపోవడంవల్ల కొట్టేశాను. శ్రోత్రియఘటాల అక్షరాలు స్ఫుటంగా ఉండవు. శకటదాసు దస్తూరీ ముత్యాల కోవలా ఉంటుంది గనక అతడిచేత నేకొట్టేసిన వృత్తాంతమే నేర్పుతో రాయింపించాలని సిద్ధార్థకుడితో చెప్పు.

శా—చిత్తం.

చా—దీని అవసరం ఎవరికి కలిగిందంటే నీకేమీ తెలియదుగా నువ్వెల్లా చెప్పగలవు? ఈలేఖ దీంతోపాటు కొంత వాచ్యమూకుడా సిద్ధార్థకుడే తీసికెళ్ళ వలిసి ఉంటుం చెప్పు.

శా—చిత్తం (అని, పత్రం పుచ్చుకుంటాడు)

చా—జాగర్తగా విన్నావా?

శా—చిత్తం.

చా—ఇది అయింతరవాత, ఆదారినే వెళ్ళి చందన దాసుని ఓమాటు నేను రమ్మన్నానని చెప్పిరా.

శా—చిత్తం. (అని కు. మ. కి నిష్క్రమిస్తాడు)

చా—(వెళ్ళిన శార్ఙ్గరవుడివేపే చూస్తూ) ఈవెట్టి శార్ఙ్గరవుడు సిద్ధార్థకుడితో చెప్పడంలో అవకతవకగా ఉన్నా సిద్ధార్థకుడు యథార్థం పోల్చుగుని గడుసుగా వ్యవహరించగలడుగా! అందరితోటీ అంతా చెప్పేసెయ్యడానికీ

వీలులేదు. కొందరితోనైనా ఏకొంతైనా చెప్పకాతప్పదు... చారులవల్ల విన్నదాన్నిబట్టి రాక్షసుడితో అరమరలు లేకుండా కలిసిపోయిన రాజులు అయిదుగురు. కులూత దేశాధిపతి-చిత్రవర్మా, మలయదేశాధీశుడు-సింహనాదుడూ, కాశ్మీరరాజు-పుష్కరాక్షుడూ, సింధుభూపతి-సింధుసేనుడూ, పారశీక ప్రభువు - మేఘనాదుడూ! ఎవరో అయిదుగురు అని ఈ ఉత్తరంలో ఉండడమూ, రాత శకటదాసుది కావడమూ, జరిగాయా, వీళ్ళని చిత్రగుప్తుడు రక్షించాలిగాని మరోడివల్ల కాదు. వాచ్యంలో ఆ అయిదుగురి రాజులపేర్లూ, వాళ్ళు కోరుతూన్న ప్రతిఫలంయొక్క వయినాలూ చెప్పిస్తాను. ఈ ఎత్తుతో మలయకేతువు రాక్షసుణ్ణి పూర్తిగా శంకించి విసర్జించేస్తాడు, ఆ అయిదుగురి రాజుల్నీ మట్టం చేసేస్తాడు తనపనికూడా మట్టంచేసేసుగుంటాడు.

[ కు. మ. నించి పత్రంతో ప్రవేశిస్తాడు ]

సి—గురుభ్యోనమః గురుదేవా, జయం.

చా—సిద్ధార్థకుడా ?

సి—చిత్తం. ఇదిగో తమరు కోరినది.

చా—సరిగ్గా నిర్వహించావా ?

సి—చిత్తం. తమరి సంకల్పానికి తిరుగు ఉంటుందా?

చా—అదికాదు. శార్ఙ్గరవుణ్ణికాదూ పంపించాను !

సి—అయితేంగురూ ! అతడు చెప్పినదాన్ని గ్రహించుగుని, ఇది ఎందుకో ఎవరికి కావాలో చెప్పకుండా శకట

దాసుచేత తీరుగా మీరు రాసికొట్టేసిన వాక్యాలు రాయిం చేశాను. ఇదుగో !

చా—(పత్రం పుచ్చుగుని) బాగుంది. అతడి లిపి చూశావా, ఎంత గుండ్రంగా ఉందో! సరే. ఈ ముద్ర తీసుగుని, దీనిమీద ముద్రవెయ్యి, బాబూ !

సి—(ఉంగరం తీసుగుని ఎ. ఎ. కి వెళ్ళి ముద్రించడం అభినయించి వచ్చి, పత్రమూ ఉంగరమూ చాణక్యుడికి ఇచ్చేస్తాడు)

చా—దీని వయినం తరవాత చెబుతాను. మరో పన్లో నీసాయం కావాలి.

సి—ఆజ్ఞ ఇయ్యండి, మహాప్రభూ! ఛాత్రుణ్ణి.

చా—ఒకగడియ తరవాత వధ్యస్థానానికి వెళ్ళు. అక్కడ శకటదాసుని కొఱతని వేస్తూంటారు. నువ్వు కనుసంజ్ఞ చెయ్యి. హంతకులు భయపడ్డట్టు నటించి పారిపోతారు. అప్పుడు నువ్వు శకటదాసుని విడిపించి గబగబా తీసిగెళ్ళి రాక్షసులవారికి అప్పగించు. రాక్షసుడు నిన్ను ఆదరిస్తాడు. నువ్వు అక్కడే ఉండు. అతడేమన్నా ఇస్తే పుచ్చుగో. సమయంకోసం చూస్తూండు. నేను తరవాత చెప్తాను. తత్ప్రకారం చెయ్యి.

సి—చిత్తం. సెలవు (అని ను. ఎ. కి నిష్క్రమిస్తాడు)

శా—(ను. మ. నించి వచ్చి) గురుదేవులకి నమస్కారం. విశ్వావసులతో చెప్పాను. సిద్ధార్థకుడికి ఇచ్చాను.

చందనదాసుని తీసుగొచ్చాను. అతడు ద్వారందగ్గిర ఉన్నాడు.

చా—చాలా మంచిపనిచేశావు. నే నతణ్ణి చూస్తాను. లే. నువ్విప్పుడేవెళ్ళి కాలపాశిక దండపాశికుల్ని కలుసుగుని మన ఆజ్ఞలు రెండు ఇచ్చిరావాలి. రాక్షసుడి ప్రేరేపణ వల్ల పర్వతకుణ్ణి చంపిన జీవసిద్ధిమీద ఆనేరం మోపి అతణ్ణి లేవగొట్టెయ్యడం ఒకటీ. మనకి ద్రోహంచేస్తూన్న శకటదాసుని కొఱతని వెయ్యడం రెండోదీ. శకటదాసు భార్యా బిడ్డల్నికుడా బంధించడం నా ఆజ్ఞ అని చెప్పు. వెళ్ళు. చందనదాసుని లోపలికి రమ్మను.

శా—చిత్తం (కు. మ. నిష్క్రమించగా, అక్కణ్ణించే చందనదాసు వస్తాడు)

చం—(వస్తూ) మంత్రినర్యా! జయం.

చా—క్షేమమా, సెట్టీ!

చం—తమకటాక్షం.

చా—రా, రా. పీటమీదకూర్చో.

చం—వద్దుబాబూ. మేం కిందకూచోడమే నయం.

చా—సరి సరి. మేమూ నిన్ను మన్నించడం ఎరగని వాళ్ళం? పీటమీదే కూర్చుందూ!

చం—చిత్తం (అని పీటమీద కూర్చుంటాడు)

చా—అయితే చందనదాసూ! నీవడ్డీలూ లాభాలూ దండిగా ఉంటునాయ్యా?

చం—చిత్తం, తమ అనుగ్రహంవల్ల.

చా—చంద్రగుప్తుడి దోషాలన్నీ లెఖ్ఖపెడుతూ వెనకటిరాజులే నయం అనడం లేదుకదా ప్రజలు?

చం—(చెవులు మూసుగుని) ఎంతమాట ఎంత మాటా! అటు శరశ్చంద్రుడు ఏరీతిగానో ఆరీతిగానే ఇటు మౌర్యచంద్రుడు జనానందం చేకూరుస్తున్నాడు.

చా—జనానికి ఆనందం చేకూర్చే రాజు జనాన్నించి ప్రతిఫలం ఏమీ కోరడూ?

చం—ఓ. కోరవచ్చు. నావల్ల కోరుతూన్న దేమిటో?

చా—వెనకటి రాజులు ప్రతిఫలంగా ధనం కోరే వారు.

చం—చిత్తం.

చా—ఈరాజు కోరుతూన్నది-జనం తనకి చిక్కులు తెచ్చిపెట్టకుండా ఉంటేచాలని.

చం—రాజుగారి కోరిక ఇంతేఅయితే మేం బతికి పోయాం. అన్నమాటే!

చా—మరి ఆ చిక్కులు తెచ్చిపెట్టే జనంగురించి అడగవేం?

చం—అయ్యా...

చా—రాజద్రోహులు.

చం—ఎవరోగదా ఆపాడురాజద్రోహులు?

చా—మొట్టమొదటివాడవు. నువ్వే.

చం—శ్రీహరీ! నేనా! గడ్డిపోచ నెత్తి అగ్నిహోత్రంతో కజ్జా తెచ్చుగుంటుందా?

చా—ఏమో నీకే తెలియాలి. రాక్షసుడు రాజ ప్రతికూలుడుగదా! ఆ రాక్షసుడి భార్యాపుత్రుల్ని నీయింట్లో దాక్కో పెట్టి వాళ్ళ సంరక్షణ చేస్తున్నావట, నువ్వు?

చం—అబ్బెబ్బే, అబద్ధమండి. యథార్థం తెలుసుగో లేని వాడెవడో మీకు ఇట్లా చెప్పిఉంటాడు.

చా—సందేహించకుండా చెప్పెసెయ్, తీరిపోతుంది. అవతలవాళ్ళు వాళ్ళ ఆదుర్దాలో కాళ్ళా వేళ్ళా పడుతూండే మాట నిజమే. వాళ్ళని ఏమనం? కాని దాక్కోనిచ్చేవాడిది మాత్రం తప్పనే యెంచాలి.

చం—అబద్ధంయొక్క అవసరం నాకేమిటండీ? నిజమే. వెనకటి గడబిడల్లో వారిని దాచాను. కాని, ఇప్పుడు దాచుతున్నాను అనేమాట అసత్యం.

చా—సెట్టీ! ఇది చంద్రగుప్తరాజ్యం, జాగర్త. అబద్ధాలాడకు. వాళ్ళని అప్పగించెయ్. కపటంవద్దు.

చం—కపటంలేదు.

చా—లేకేం? ఓగుక్కలో దాచానంటావు, రెండో గుక్కలో దాచలేదంటావు.

చం—నిజమేనండీ. దీట్లో కపటం ఏముందీ? వారు వెనక నాయింట్లో ఉంటూండేవారు. ఇప్పుడు లేరు.

చా—ప్రసంగతే యథార్థం అయితే, ఇప్పుడు వా ళ్లెక్కడున్నారు?

చం—నేనెరగనండి.

చా—ఎరక్కపోవడమేమిటి, సెట్టీ! (అని వికారంగా నవ్వుతాడు.)

చం—(ఊరకుంటాడు.)

చా—చాణక్యుడు నందుణ్ణి పట్టుగున్నట్టే, మీ రాక్షసుడు చంద్రగుప్తుణ్ణి పట్టుకోగలడనుకున్నావేమో, పాపం! అది కేవలం భ్రాంతి. (ఎ. మ. కి. చూసి) శార్ఙ్గరవా!

శా—(కు. మ. నించి వచ్చి) వచ్చి, ఇక్కడున్నాను గురూ!

చా—సరే.

[కు. మ. వైపు, లోపల, పెద్దకోలాహలం]

—శిష్యా! ఆ కోలాహలం ఏమిటో చూసిరా!

చా—సెట్టీ! వాళ్ళని నీయింట్లో దాచడానికి ఎంత బాధపడుతున్నావో, ఆసంగతి నీహృదయంలో దాచడానికి మళ్ళీ అంతబాధా పడుతూన్నట్టున్నావు.

చం—లేదండి. నేను ఏదాపరికమూ ఎరగను.

శా—(కు. మ. నించి వచ్చి) గురువర్యా! ఎవడో జీవసిద్ధిట. వాడు రాజద్రోహిట. చంద్రగుప్తులవారి ఆజ్ఞ ప్రకారం అతణ్ణి ఊళ్ళోంచి తరిమేస్తున్నారు.

చా—సెట్టీ! చూశావా రాజద్రోహులపాట్లు? నువ్వు దాచిన రాక్షసగృహజనాన్ని తెచ్చి అప్పగించెయ్.

చం—వాడు మాయింట్లో లేరండి, బాబూ!

(కు. మ. వైపు తెరలో మళ్ళీ కలకలం)

చా—శార్ఙ్గరవా! ఈఅల్లరేమిటో చూసి రా.

శా—(కు. మ. వైపు వెడతారు.)

చా—సెట్టీ! అబద్ధానికి ఎల్లాసూ ప్రతిష్ఠచేశాంగదా, దాన్ని చివరంటా సంరక్షణ చేస్తేసరి అనుకున్నట్టున్నావు, సాగదుసుమీ!

చం—తమ సమక్షంలో హెచ్చుతగ్గుగా మాట్లాడ్డం ఎవరితరం, మంత్రివర్యా!

శా—(కు. మ. నించి వచ్చి) గురుదేవా! వీడు మరో రాజద్రోహిట. ఇతడు శకటదాసనే కరణంట. అతణ్ణి కొఱతనివెయ్యడానికి ఈడ్చుగుపోతున్నారు.

చా—బోధపడిందా, చందనదాసూ, రాజద్రోహుల గతి! రాక్షసుడి భార్యాపుత్రులు నీయింట్లోఉన్నారు. అప్పగించెయ్! నామాటవిను. మరోడి భార్యాపుత్రుల్ని రక్షించడానికని బయల్దేరి నీభార్యాపుత్రుల్ని చెడనాడుకోకు.

చం—మహామంత్రీ! ఎందుకు నన్నిల్లా బెదిరించడం? రాక్షసమంత్రి తాలూకు భార్యాపుత్రులు మాయింట్లో ఉన్నా వారిని తీసుగొచ్చి మీకప్పగించనే, లేనప్పుడు వారిని ఎట్లా తీసుగొచ్చి అప్పగించను!

శా—(క. ఎ. కి వెళ్ళి అప్పుడే వచ్చి) ఆచార్యా! ఘోరం మహాఘోరం! వాళ్ళంతాకుడా వెళ్ళిపోయారట. ఇక మనం (అని దుఃఖిస్తాడు)

చా—వత్సా! శార్ఙ్గరవా! దుఃఖిస్తున్నావా? వద్దు వద్దు అనవసరం. వాళ్ళందర్నీ పోనీ. వాళ్ళే కాకుండా సేన లన్నీకుడా లేచిపోనీ. మన కేంభయం? నువ్వు లేవా నేను లేనా! మనం ఏదోఓటి చేద్దాం లేస్తూ!

(తెర)



## రంగం-2

[పర్వతకుడి దేశం. రాక్షసుడిబస. రాక్షసుడు చింతాగ్రస్తుడై కు. వె. నించి ప్రవేశించి, తలవంచుకుని, ఇటూ అటూ మెల్లిగా నడిచి, కూర్చుని, ఉసూరుమని, లేచి]

రా—అయ్యో! ఎంత విచారకరం! నందవంశశేషమే లేదే! రాత్రింబగళ్ళు నేను ఆలోచించి ఆలోచించి సృష్టి చేసిన పన్నాగం ఆచరిద్దాం అంటే, రవంత ఉపాధి కుడా లేకుండా అయిందే? నిరంతరాలోచన చేసి ఊహచేసుకున్న చిత్రం చిత్రించి ప్రత్యక్షం చేసేద్దాం అనుకునేసరికి ఉపాధి కరవైపోయినట్టుగా వచ్చింది నాఅవస్థ! నాప్రభువుకీ పక్షంలో సంతుష్టి కలిగించలేకపోయాను! ఇప్పుడు, ఆయన ఆత్మకేనా శాంతి చేకూర్చాలనే ఊహతో దీక్షమానక, భక్తిమరవక, శరీరసౌఖ్యానుభవాలలో మునిగిపోక, ప్రాణంమీద ఆశలు పెట్టుకోక, ఆత్మాధిక్యం కోసం పరితపించక, ఇంకా రాజ్య తంత్రం నడుపుతూనేఉన్నాను......సామ్రాజ్యలక్ష్మీ! ప్రజ్ఞకి విలవకట్టే సామర్థ్యం నీకు లేదుకదా! భూమి ఇంత విపులకదా, ఈపృథివిమీద నీకు మరోమహారాజే కనపడలేదూ, వరించ డానికీ! భూమిమీది ఇతర రాజులంతా చచ్చారనా నువ్వెళ్ళి ఆ నీచచంద్రగుప్తుణ్ణి చేపట్టి కూర్చున్నావు? ఎంత చంచలవు! ఉండుండు. నీ నీచవరుణ్ణి రూపుమాపి నీపశుత్వం వదలగొట్టేస్తాను...ఔర! నేను పాటలీపుత్రం

విడిచిపెట్టి రానలిసొచ్చినప్పుడు నా భార్యా పుత్రుల్ని నా ప్రాణస్నేహితుడైన చందనదాసింట్లో దిగబెట్టి రావడం ఎంతో మేలు అయింది. చంద్రగుప్తుణ్ణి చంపే నిమిత్తం మేం ఏర్పాటుచేసిన హంతకుల్నీ విషజ్ఞుల్నీ ఇతర అనుచరుల్నీ కనిపెడుతూండి వాళ్ళకి కావలసినసొమ్ము మొదలైనవి రహస్యంగా ఇస్తూ వ్యవహరించడానికి శకట దాసుని అక్కడ నియమించి వచ్చాను. శత్రు పక్షంలో అసంతుష్టి వ్యాధితో బాధపడే వాళ్ళని లంచం మందుతో కుదిర్చి ఇటువైపు లాగెయ్యవలసిందనికూడా శకటదాసుతో చెప్పాను. అదీకాక, శత్రువుల మనోవ్యాపారాలు పరిశోధించడానికి జీవసిద్ధిని ఏర్పాటుచేశాను. ఎన్నో ఎందుకు ? నా ప్రజ్ఞాబాణంతో హీనజన్ముడైన చంద్రగుప్తుడి మర్మాలు ఛేదిస్తాను (నిదానించి ఇటూ అటూ పచారుచేస్తూ) ఔర ! ఓ కంట ఏడుపూ ఓ కంట నవ్వూ ! నా ప్రభువు అస్తమించిందిమొదలు నేను అలంకార విసర్జనచేశాను. మలయకేతురాజు అందు నిమిత్తం చాలా బాధపడి తను ధరించే గొప్ప హారం తీసేసి యిచ్చి, నేను ధరించవలిసిందిగా ప్రార్థిస్తూ, ఇది పంపించారు (అని ఒక ఆభరణం పైకితీస్తాడు) అహా ! ఎంత మెత్తనా మలయకేతు హృదయం ! ఇతడి ఔదార్యం నందుడి ఔదార్యాన్ని మరిపిస్తోంది. అయినా సరే. మలయకేతువుకి సింహాసనం దక్కనిదే, నాకు అలంకారాలేమిటి ? వద్దు వద్దు. సంకల్పిస్తే అతడికి సింహాసనం దక్కడం ఎంత

పని ? ఎంత సేపు ! మలయకేతు కోరిక మన్నించండి అంటూ ఎంతో ప్రార్థించి వెళ్లాడు కంచుకి. సరే మలయకేతు మాటా కొట్టెయ్యలేను, కంచుకి మాటా కాదనలేను. ధరిస్తాను (హారం ధరిస్తాడు.)

(ఎ. మ. నించి, 'అయ్యా' అని కేక వినపడుతుంది)

రా—(ఎ. మ. కేసి చూచి) ఎవరదీ ? ఏమిటి ?

(ప్రియంవదకుడు ఎ. మ. నించి వచ్చి నమస్కరించి)

ప్రి–అయ్యా ! ద్వారందగ్గిర ఓ పాములవాడున్నాడు. వాడి పేరు జీర్ణవిషుడట. మీ యెదట పాముల్ని నాట్యం చెయించి చూపించాలిట, వాడు.

రా—అప్పుడే సర్పదర్శనమా? నాకిష్టంలేదు. అతడికేమైనా యిచ్చి పంపించెయ్.

ప్రి—(ఎ. మ. కి వెళ్ళి అప్పుడే ఒక పత్రంతో వచ్చి) అయ్యా! వాడు వెళ్ళడంలేదండి. నేను పాములవాణ్ణిమాత్రమే కాదు. నేటికాలపుకవిని. ఇప్పుడు వారి దర్శనం నాకు వీలు పడకపోతే, ఈపత్రం వారిచేతికియ్యి. అని ఇది నాకిచ్చాడు.

(అని ఒకపత్రం రాక్షసుడికి అందిస్తాడు)

రా—(పత్రం పుచ్చుగుని చూసి చదవడం అభినయిస్తూ) "కుసుమ శరీరంలో అదృశ్యమైఉండే మకరందాన్ని తుమ్మెదలు ఎంతో నేర్పుతో పీల్చుగుని, తేనెపట్టునిర్మాణం చేసి దాల్లో ఆ మకరందాన్ని కూడబెట్టడం మరొకళ్ళకోసమే

కదా!" (ఆగి) ఏమిటిది! 'పుర' శబ్దానికి 'శరీరం' అని ఉందికదా. 'కుసుమశరీరం'—అంటే 'కుసుమపురం' నాకు అన్వయిస్తోంది. వీడెవడో చాడడు. బహుశా, విరాధగుప్తు డయి ఉంటాడు. (పైకి) ప్రియంవదకా! పోనీ, ఆ కవిని లోపలికిరమ్మను. నేనతడితో కొంతసేపు కవితా ప్రసంగం చేస్తాను. అది ముగిసేవరకూ నువ్వు ద్వారం కాచిఉండు.

ప్రి—చిత్తం (అని ఎ. మ. కి వెళ్ళగా. ఎ. మ. నించి విరాధగుప్తుడు వస్తాడు.)

వి—(ఎ. మ. నించి వచ్చి నమస్కరిస్తూ) గురుభ్యో నమః అమాత్యశేఖరా, జయం.

రా—నువ్వేనా, విరాధగుప్తా! రా! కూర్చో.

వి—(కూర్చుంటాడు.)

రా—మన అవస్థ ఇట్లాఉందికదా! కష్టాల్లో మునిగి పోతున్నాంకదా!

వి—దేవరవారి ప్రజ్ఞ ఏనాటికేనా మనల్ని గట్టు మీద పడెయ్యకపోతుందా?

రా—అది సరేకాని, ఏమిటి కుసుమపురం వార్తలు!

వి—అమాత్యా, ఎన్నైనా ఉన్నాయి. అవి చెప్పడం అనేపాపం కట్టుగోవలిసినవాణ్ణి నేనయాను.

రా—త్వరగా చెప్పు.

వి—శక యవన కిరాత కాంభోజ పారశీక బాహ్లీక వాహినుల్తో కలిసిఉన్న చంద్రగుప్తపర్వతకసైన్య మహా సముద్రంలో కుసుమపురం ఒక ద్వీపంలాగ తేలుతూఉంది.

రా—(విని, పక్కనున్న ఒరతెచ్చి కత్తిలాగి) నా కంఠంలో ఊపిరి ఉంటూండగా కుసుమపురం, అన్యాక్రాంతం కావడమే !

వి—అమాత్యవర్యా! నిదానించండి. జరిగిపోయిన సంగతులు నేను చెబుతున్నాను. వినండి.

రా—(ఉద్రేకం తగ్గి ఉసూరుమని) అవునవును. జరిగిపోయినసంగతులే నువ్వు చెబుతూంటూ ! కాని అవి కళ్ళ ఎదట ఇప్పుడు ఉంటూన్నట్టై భ్రమలోపడ్డాను. (కత్తి ఒక పక్క గిరవబెట్టి తలవాయవంచి, మోకరించి)

సర్వార్థసిద్ధీ! మహాప్రభూ! మీరు నన్ను మన్నించిన మన్నన మరిచిపోగలనా! అశ్వదళాల్నీ, గజదళాల్నీ, సైనిక దళాల్నీ పాటలీపుత్రం చొరనీయకుండా అరికట్టవలిసిందని అక్కడికి మీరు నాకు పంపిన ఆజ్ఞ మరిచిపోగలనా? (విరాధ గుప్తుడికేసి తిరిగి) చెప్పూ, విరాధగుప్తా! వింటున్నాను.

వి—అప్పుడు ప్రజలకష్టాలు చూడలేక, సర్వార్థసిద్ధి మహాప్రభువు సొరంగం ద్వారా నగరంలోంచి బయటపడి అడవుల్లో జనక్షేమంగురించి తపస్సు చేసేనిమిత్తం వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళగానే సైనికబలాల్లో నిరుత్సాహం వ్యాపించింది. తమరు కూడా ఒక రహస్యమార్గం చూసుగుని కుసుమపురం విడిచి నందోద్ధరణకోసం వచ్చేస్తిరికదా ! ఇంతలో మీరు చంద్రగుప్తుణ్ణి చంపడానికై నియమించిన

విషకన్యా సంపర్కంవల్ల పాపం, పర్వతేశ్వరుడు చచ్చి పోయాడు.

రా—ఔరా, ఔరా! ఎంతపని జరిగిందీ! విషకన్యా మూలకంగా పర్వతేశ్వరుడు చచ్చిపోయాడా? ఎంత మహా శ్చర్యం జరిగిందో గమనించావా?

విషకన్య నాచేతిది. ఆవిషకన్య ఒక్కణ్ణే చంపగలదు. ఒక్క చంద్రగుప్తుణ్ణి చంపడమే నాకోరిక. కాని, అది పర్వతేశ్వరుణ్ణి చంపింది. పర్వతేశ్వరుణ్ణే చంపాలని ఆ దుష్ట చాణక్యుడి కోరిక. నాప్రయోగంవల్ల చాణక్యుడికోరిక ఫలించింది.

ఇది ఎట్లాఉందంటే: మాయశక్తి కర్ణుడిచేతిది. ఆ మాయశక్తి ఒక్కణ్ణే చంపగలదు. ఒక్క అర్జునుణ్ణి చంప డమే కర్ణుడికోరిక. కాని, అది ఘటోత్కచుణ్ణి చంపింది. ఘటోత్కచుణ్ణే చంపాలని ఆ టక్కరి కృష్ణుడి కోరిక. కర్ణుడి ప్రయోగంవల్ల కృష్ణుడికోరిక ఫలించింది...సరే చెప్పు, విరాధగుప్తా! ఎల్లాంటి వృత్తాంతం వినడానికేనా నేను సిద్ధపడవలిసిందే!

వి—తండ్రి హత్యతో తల్లడిల్లిపోయి, మలయ కేతువు, ప్రాణాలు చేత్తోపట్టుకుని, పరారీ అయిపోయాడు.

రా—ఔర! ఆశ్చర్యం!

వి—అదృష్టం ఏదారిని నడుస్తుందో ఎట్లా చూడ గలం, మంత్రిశేఖరా!

రా—చూడగలిగితే దాన్ని అదృష్టం అని ఎందు కంటాం! సరే. మనశిల్పి—దారువర్మ యత్నం ఏమైందీ?

వి—రాజాజ్ఞ తనికి చేరిం తరవాత కార్యాచరణకి దిగవలిసిన సంగతి మరిచిపోయి, తొందరపడి, రాజాజ్ఞ తనికి చేరకుండానే ప్రధమ రాజద్వారం సువర్ణ తోరణాలతో అలంకరించి సిద్ధంచేసి ఉంచడంవల్ల, ఆ పాడుచాణక్యుడు దారువర్మని పసికట్టేశాడు.

రా—చాణక్యుడు దారువర్మకి ఏమైనా హాని కలిగించాడా?

వి—లేదు. సరిగదా, దారువర్మ పనివాడితనం మెచ్చుతూన్నట్టు నటించాడు.

రా—నటించి, ఊరుకోడే!

వి—ఊరుకోలేదు. ఆ అర్ధరాత్రివేళ చంద్రగుప్తుణ్ణి సింహాసనంమీద కూర్చోబెట్టేశాడు. పైగా, పర్వతేశ్వరుడి సోదరు డున్నాడే వైరోచకుడు—అతడికి అర్ధరాజ్యం పంచిపెట్టించి, అర్ధాసనం ఇప్పించాడు.

రా—ఇట్లా చెయ్యడం ఎందుకుచేశా!

వి—ఎందుకా! అచ్చంగా మూడుమూర్తులా చంద్రగుప్తుణ్ణి స్ఫురింపజేసే వేషం ఆ వైరోచకుడికి వేసి, చంద్రగుప్తు డెక్కవలసిన ఏనుగు — చంద్రలేఖమీద, అతణ్ణి ఎక్కించాడు.

రా—అరే. చంద్రగుప్తుణ్ణి ఘాతం చేసెయ్యడానికి నేను బర్బరకుణ్ణి నియమించానే?

వి—అతను ఎవణ్ణో కత్తిపోటు పొడవడానికి సిద్ధంగా ఉన్నట్టు తెలిసిపోయేలాగ, కత్తి ఒకచేత్తోనూ ఒర రెండో చేత్తోనూ పట్టుగుని నుంచున్నాడు.

రా—అయ్యో! ఇతడూ తొందరపడిపోయాడే.

వి—ఇంతలో దారువర్మ యంత్ర తోరణాన్ని జార విడిచాడు.

రా—అది కిందపడుతూ చంద్రలేఖమీద వస్తూన్న వైరోచకుణ్ణి చంపలేదుకద!

వి—లేదు. అప్పుడే ఏనుగు హఠాత్తుగా బెదరడం వల్ల కత్తిలాగి పొడవడానికి సిద్ధంగా నిలబడ్డ బర్బరకుణ్ణి చంపింది.

రా—అయ్యో! అయ్యో! యత్నంఅంతా విఫలం అయిందే!

వి—తనగుట్టు వీధిని పడితే తన భవిష్యం ఉండదని భయంవేసి, దారువర్మ ఒక ఇనపమేకుతో చంద్రగుప్త వేషంలో ఉన్న వైరోచకుణ్ణి చంపేశాడు.

రా—(తెలపట్టుగుని) కష్టం కష్టం! మరేంజేశాడు దారువర్మ!

వి—మరి ఏమీ చెయ్యలేదు. ఏనుగుముందున్న జనం విసిరిన బెడ్డల దెబ్బలవల్ల ప్రాణాలు విడిచాడు.

రా—అయ్యయ్యో! దారువర్మా! మిత్రమా! ఎంత బాధపడ్డావో కదా! ఎంత దురదృష్టం పట్టింది మనకి, విరాధగుప్తా! వైద్యు డేమిచేశాడు?

వి—మన అభయదత్తుడేనా అండి.

రా—మరే.

వి—అతడు చంద్రగుప్తుడికని మంచి ఔషధం ఒకటి చేశాడు.

రా—(కొంచెం ఆశతో) అది చంద్రగుప్తుడు తిన్నాడా?

వి—లేదు. అది చంద్రగుప్తుడు తినబోతూన్న సమయానికి ఎక్కణ్ణించో చాణక్యుడు వచ్చి పడి, ఆ ఔషధం ఒక బంగారుగిన్నెలో వేసి అది రంగుమారడం కని పెట్టి తినద్దని చంద్రగుప్తుడితో అన్నాడు.

రా—అయ్యో! అభయదత్తుణ్ణి వాళ్ళేమిచేశారు?

వి—అతడి చేతే ఆ ఔషధం తినిపించారు.

రా—అరెరే! అతడూ గతించాడా? అతడు ఎటు వంటి ప్రజ్ఞావంతుడో కదా!...మన అవస్థ! మరి, చంద్ర గుప్తుడికి పక్క పరుస్తూండడానికి మనం ప్రమోదకుణ్ణి నియమించాంగదా, వాడేమిటి చేశాడు, చెప్పు.

వి—వాడాండీ! మీరిచ్చిన సొమ్ము తినమరిగి, నీకింత డబ్బు ఎక్కడిదిరా అని అడిగిన వాళ్ళకి, ఎంతమంది అడుగు తోచ్చారో అన్నిరకాల సమాధానాలు ఏ రెండింటికీ

సంబంధంలేనివి చెప్పడం చాణక్యుడు పరిశోధకులవల్ల తెలుసుగుని వాణ్ణి పోల్చుగుని చిత్రవధ చెయించాడు.

రా—అయ్యో! ఈ విషయమూ మనకి ప్రతికూలం అయిందా? విరాధగుప్తా! మనకి చీమకాలంతైనా అదృష్టం లేదు అనడానికి ఇంక ఏమికావాలి దృష్టాంతం!...పోనీ, విరాధగుప్తా! చంద్రగుప్తుణ్ణి చంపడానికి, అతడి పడకగది గోడలలో మకాంచేసి సమయంచూస్తూ ఉండవలసిందని సొరంగాలద్వారా పంపించామే భీభత్సకుడు మొదలైన వాళ్లని! వాళ్ళు ఏమిచేశారూ?

వి—అమాత్యవర్యా! వాళ్ళ వృత్తాంతమే మరీ భీభత్సం!

రా—భీభత్సమే! వాళ్ళు గోడల గర్భాల్లో దాక్కుని ఉన్నసంగతి ఆ యమ చాణక్యుడు పసికట్టలేదు కద, కొంప తవ్వి!

వి—పసి కట్టేశాడండి. చంద్రగుప్తుణ్ణి ఆ పడక గదిలోకి పంపించడానికి పూర్వంతనేవెళ్లి ఇటూ అటూ పరకాయించి చూసి, ఒక గోడకున్న ఒక చిన్నరంధ్రం లోంచి చీమలు బియ్యపు గింజల్తో బయటికి రావడం గుర్తించి, సంగతి తెలుసుగుని, తను ఇవతలకి వచ్చేసి ఆ యిల్లు యావత్తూ తగలబెట్టించాడు. మనవాళ్ళు గోడలలోపల చేసుగుని ఉన్నమార్గాలనిండా పొగవ్యాపించగా వాళ్ళకి పొగమూలాన్ని చూపానక దారి తెలియక మన భీభత్స

కుడు మొదలైనవాళ్ళు ఎక్కడివాళ్ళక్కడ మాడిపోయారండి.

రా—అయ్యొయ్యో ! ఇంత కష్టం ఎక్కడేనా ఉంటుందా ? దురదృష్టం పూర్తిగా మనది, అదృష్టం యావత్తూ చంద్రగుప్తుడిదే ! సరే. మన దురదృష్ట పరంపర ఇంతటితో ఆఖరేనా, ఇంకా ఉందా ?

వి—ప్రధానిశేఖరా ! మీకు సంబంధించినవాడు అని ఎవడెవణ్ణి గురించి అనుమానపడ్డాడో చాణక్యుడు వాణ్ణి వాణ్ణల్లా హింసించాడండి.

రా—ఇది కూడానా ! విరాధగుప్తా ! ఎవరెవర్ని ?

వి—జీవసిద్ధిని—న్యూనత పరిచి ఊళ్ళోంచి వెళ్ళగొట్టించాడు.

రా—ఔరా ! అతడిమీద అపరాధం ఏమి మోపి ?

వి—మీరు ప్రయోగించిన విషకన్యకచే పర్వతేశ్వరుణ్ణే చంపింది అతడే—అని.

రా—(ముక్కుమీద వేలుతో) ఆహా ! ఏమి చాణక్యం !...మరెవరిని ?

వి—శకటదాసుని.

రా—అయ్యో ! పాపం, అతనికేమిటి శిక్ష ?

వి—కొరతవేసి చంపడం.

రా—ఏం నేరం మోపి ?

వి—చంద్రగుప్తుడి శరీరానికి హానిచెయ్యడం సంకల్పించుకున్న దారువర్మ మొదలైనవాళ్ళని పంపినవాడు శకటదాసే—అని

రా—హా! మిత్రమా! శకటదాసా! నీకా ఇటువంటి మరణం!

(ఎ. మ. నించి ప్రియంవదకుడు ప్రవేశిస్తాడు)

ప్రి—(ఎ. మ. నించి వస్తూ) అమాత్య శేఖరా! తమ దర్శనం నిమిత్తం వచ్చారు—శకటదాసు!

రా—(ఆశ్చర్యానందాలతో చటాల్ని లేచి) ఎవరు? వచ్చినవాడు శకటదాసా? శకటదాసే! ఏమిటి విరాధగుప్తా! శకటదాసు మనకి ఇక లేడన్నావునువ్వు! ఆశ్చర్యం!

(ప్రియంవదకుడితో) రమ్మను రమ్మను. త్వరగా తీసుకురా!

(అని ఎ. వె. కి వెళ్ళవలిసిందని విరాధగుప్తుడికి సంజ్ఞ చేసి అతణ్ణి పంపగా ఎ. మ. నించి శకటదాస సిద్ధార్థకులు వచ్చి నమస్కరిస్తారు)

శ—జయం, అమాత్యవర్యా, జయం.

రా—మిత్రమా, శకటదాసూ! నువ్వు చాణక్యుడి కంటపడీకుండా మాకు సశరీరంగా లభించావు. ఒక్కసారి, రా (అని శకటదాసుని కౌగిలించుకుని, పీఠంచూపించి) కూర్చో.

శ—(కూర్చుంటాడు)

రా—మిత్రమా! శిక్షతప్పించుగుని ఎట్లా రాగలి గావు?

శ—(సిద్ధార్థకుణ్ణి చూపిస్తూ) ఈయన దయవల్ల! ఈమిత్రుడు ఆ హంతకుల్ని బెదరగొట్టేసి, నాకట్లు కోసేసి, నన్ను విడిపించి క్షేమంగా మీ సాన్నిధ్యానికి చేర్చాడు.

రా—(సంతోషంతో లేచి, సిద్ధార్థకుడిదగ్గిరికి నడుస్తూ) ఆహా! ఎంత అంతఃకరణయ్యా నీదీ, మిత్రమిత్రమా! నువ్వుచేసిన ఉపకారానికి ఇదెంతగాని, దయచేసి స్వీకరించు (అని తను ధరించిన హారం తీసిఇచ్చి) మలయకేతు ప్రభువు తన తండ్రి పర్వతేశ్వరుడి చిహ్నంగా ఇప్పుడే నాకు పంపించాడు.

సి—(ఆభరణం స్వీకరిస్తూ) మహాప్రసాదం! మంత్రి శేఖరా! ఇది నాదగ్గిర నేను దాచుకోగలనా? పోనీ ఓపని చేసిపెట్టండి. (అని తడుముకుని ముద్రికతీసి) ఈ ముద్రికతో ముద్దరవేసి మీదగ్గిరే దాచుకోడానికి అనుజ్ఞ ఇయ్యండి. నాకు కావలిసి నప్పుడు నేను పుచ్చుగుంటాను.

రా—ఓ నీచిత్తం. అట్లానే కానీ! శకటదాసూ! ఇతడు కోరినప్రకారం చెయ్యి.

శ—(ముద్రిక పుచ్చుగుని చూసి, రహస్యంగా) అమాత్యా! ఈ ఉంగరంమీద మీపేరు ఉందేమిటీ?

రా—(రహస్యంగా) నాఉంగరం నాభార్యదగ్గిర ఉంచాను. (పైకి) మిత్రమా! నీకీ ఉంగరం ఎక్కడిదీ?

సి—కుసుమపురంలోనండీ చందనదా సున్నాడే, ఆ వర్తకుడి ఇంటిఎదట నాకిది దొరికిందండీ.

రా—బాగానే ఉంది.

సి—నిజమే, అమాత్యా! ఏదోలాగ అంటున్నారే మీరు?

రా—అబ్బెబ్బే, ఏముంది! గొప్పవాళ్ళ యింటి యెదట దొరకడం బాగానేఉంది అన్నాను.

శ—సఖా, సిద్ధార్థకా! ఈఉంగరంతో నీకేంపనీ? ఇది ఆయనిది. ఆయన కిచ్చెయ్. నీకు బహుమతీకూడాఇస్తారు.

సి—ఓ ధన్యుణ్ణి. ఎవరి ఉంగరం వారి వేలిమీద ఉంటేనే శోభ! ఇదుగోనండి (అని, ఉంగరం రాక్షసుడికి ఇస్తాడు)

రా—(ఉంగరం తీసుగుని) మిత్రమా! (అని శకట దాసుకి అది యిస్తూ) దీంతో నువ్వు ఆచరించవలిసిన నా అధికారం ఆచరించు.

శ—చిత్తం

సి—ఇంకో మనివి ఉందండి.

రా—చెప్పవయ్యా, నీ కభ్యంతర మేమిటి!

సి—నామొహం మళ్ళీ ఆ పాటలీపుత్రంలో ఎక్కడైనా కనిపించిందా ఆ చాణక్యుడు తినేసేస్తాడు, నన్ను. అందుచేత, నేను మీసేవచేసుగుంటూ ఇక్కడే ఉండి పోతాను.

రా—ఓ. దివ్యంగా ఉంది. అది మాకు పరీ సం తోషం. ఇక్కడే ఉండిపో అని నేనే సీతో అనేయ్య వలిసింది మాతో నువ్వే అనేశావు.

సి—తమ అనుగ్రహం.

రా—శకటదాసూ! మన మిత్రుణ్ణి విశ్రమింప - చెయ్యి.

శ—చిత్తం. మిత్రమా, రా.

(కు. మ. కి శకటదాసూ, సిద్ధార్థకుడూ నిష్క్రమిస్తారు)

(ఎ. వె. నించి విరాధగుప్తుడు వస్తాడు)

వి—అమాత్యా!

రా—రా, విరాధగుప్తా! నువ్వు తెచ్చిన వృత్తాం తాల గురించి చాలా కృతజ్ఞుణ్ణి. శకటదాసు సంగతికూడా నువ్వు గ్రహించినంత వరకు యథార్థమే. దైవయోగంవల్ల అతను మృత్యుపాశాల్లోంచి ఇవతల పడ్డాడు. (అని అతడితో సహా ఎ. ఎ. వరకూ నడుస్తూ) నువ్వు ఈ వేషంలోనే తిరుగు. చంద్రగుప్తుడి దగ్గర మనవాడొకడు వైతాళికుడుగా ఉన్నాడు. అతణ్ణి కలుసుగుని చాణక్య చంద్రగుప్తులికి విరోధం బయల్దేరేటట్టు పన్నాలని చెప్పు.

వి—అసలు చాణక్యుడి ప్రజ్ఞామదంవల్ల చంద్రగుప్తు డికి ఈపాటికే మోహం మొత్తిపోయి ఉండవచ్చునని నా

నమ్మకం! అందర్నీ ఆజ్ఞాపించినట్టే, చంద్రగుప్తుణ్ణికూడా చాణక్యులవారు ఆజ్ఞాపిస్తూనేఉంటారు.

రా—సరే. నువ్వు వెళ్ళు. యథార్థస్థితి కనిపెట్టి వెన్వెంటనే వచ్చి వర్తమానం చెప్పు.

వి—చిత్తం (అని ఎ. వు. కి పోతాడు.)

ప్రి—(కు. వు. నించి అప్పుడేవచ్చి) అమాత్యా! (అని మూడునగలూ చూపించి) ఈమూడునగలూ ఎవరో అమ్మతెచ్చారట. శకటదాసుగారు ఇవి తమకి చూపించి కొనమంటారేమో కనుక్కోమన్నారు.

రా—(నగలుచూసి) గొప్పవే. తగ్గసొమ్మిచ్చి తీసుకోమను.

ప్రి—చిత్తం. (అని కు. వు. కి నిష్క్రమిస్తాడు.)

రా—(ఇటూ అటూ నడుస్తూ) చంద్రగుప్తచాణక్యులకి విరోధమేగనక తటస్థిస్తుందా, మహా చక్కగా ఉంటుంది. ఈవరకే, అసలు, తటస్థించి ఉంటుంది. ఏమంటే, నేనే సమ్రాట్టునని చంద్రగుప్తుడి గర్వం, నేనే సర్వజ్ఞుణ్ణని చాణక్యుడి గర్వం. రెండుగర్వాలు ఒకేచోట ఎంతకాలమని ఇముడుతాయి?...కానీ...(అంటూ, కు. వె. కి. నడుస్తూండగా, తెర.)

---

## రంగం-3

[రెండవ తెరకి ఇవతల ఖాళీస్థలం. కు. ఎ. నించి కంచుకి వేషంతో నిపుణకుడు ప్రవేశించి, నడిచి, ఆగి (ఈ వేషంలో చంద్రగుప్తమహారాజుతోనూ తనతోనూ నేను ప్రసంగించవలిసి ఉంటుందని గురుదేవులఆజ్ఞ! ఎట్లా నిర్వహిస్తానో! కాని, చాణక్యకటాక్షంఉంటే భయం ఏమిటి? మాప్రసంగాలు వినే శత్రుచారుల్ని నేను పసిపట్టాలి అని ఎ. ఎ. కి నిష్క్రమిస్తాడు.) కు. ఎ. నించి ఆయుధాలు ధరించిన భటులు ఇద్దరు ఎ. ఎ. కి అడుగు వేసుగుంటూ నడుస్తారు. వెనకాల చంద్రగుప్తుడు ఠీవిగా వస్తాడు. భటులు నిష్క్రమిస్తారు.]

చం—(ఆగి) అబ్బ! రాజరికాన్ని గురించి గొప్పగా భావించనివాళ్ళు లేరు. రాజరికం చాలా ప్రీతికరం—ఆచరించేవాడికి తప్ప! రాజరికం అంటే, సాధారణ మానవజన్మ ఎత్తిన ప్రతివ్యక్తికీ ఉండగల సౌఖ్యాలుకూడా చెడనాడుకుని, నిరంతర జనసేవచెయ్యడం... అస్వతంత్రుడిదే సౌఖ్యం... భయపడడం, పరాభవం చేస్తూండడం, గునుస్తూండడం, దయాహీనంగా ఉండడం, జంకడం, నిరసించడం—వంటి వేశ్యకాంత లక్షణాలు రాజ్యకాంతకీ ఉన్నాయి. ఇవి యిల్లా ఉంటూండగా, మా ఆచార్య చాణక్యులవారు ఈవేళ ఒక విచిత్రపుకోరిక కోరారునన్ను. ఏమనిఉంటే; తమతో నేను

ఒక కలహం పెట్టుకున్నట్టూ స్వతంత్రం వహించేసి తమర్ని నేను ధిక్కరించి పారేస్తున్నట్టూ అభినయించాలిట! రాజ్యానికి కొత్తగా రావడంవల్లనేనసలు నయించ లేనే, అభినయించగలనా?...ఆయన ప్రజ్ఞేకదా నాస్థితికి మూలాధారం! కాబట్టి ఆయనమాట నాకు వేదం...ఆయన అన్న మాట జరగవలిసిందే. ఆయనమీద నేను కోపం అభినయించి తీరాలి. లేకపోతే, ఆయనికి నిజంగా కుడా కోపంరావచ్చు. యత్నిస్తాను...ఎట్లాయత్నించడం? ఆయన్ని తిరస్కరించాలని అనుకోడమే. ఎట్లాగో బోధపడటంలేదు. ఇక ఆయనతో ప్రతివాదానికి డీకోడం ఎట్లా? కానీ అదేమిటి, ఇదేమిటి, అన్నీ యత్నిస్తాను.

(ఎ. ఎ. కి చూచి సంజ్ఞ చేస్తాడు)

కంచుకి—(వస్తూ) మహారాజులుంగారికి దిగ్విజయం.

చం—మా ఆజ్ఞ పాటించారా?

కం—చిత్తం.

చం—కుసుమపురంలో ఈవేళ కౌముదీ మహోత్సవం—అని

కం—చిత్తం

చం—పౌరులందరూ విన్నారా?

కం—చిత్తం. రాజాజ్ఞ వినకపోవడం ఉంటుందా, మహాప్రభూ! దేవరవారి ఆజ్ఞ విననివాళ్ళు భూమిమీందే ఉండరే, రాజధానిలో ఉంటారా?

చం——కాని, ఎవళ్ళూ ఇంకా ఉత్సవ ప్రారంభమే చెయ్యలేదే! తోరణాలులేవు, అరిటి స్తంభాలులేవు. ఎవళ్లూ పుప్పొలూ ముడుచుగోలేదు, నగలూ పెట్టుకోలేదు... మేమే స్వయంగా చూశాం.

కం——చిత్తం, ప్రభూ!

చం——ఇదేమి చిత్తం?

కం——చిత్తం, మహాప్రభూ!

చం——స్పష్టీకరిస్తేగాని చిత్తం బోధపడటంలేదు.

కం——ఉత్సవం ఆపుచెయించారు, దేవా.

చం——ఏమిటీ? ఆపుచెయించారా? ఎవరూ!

కం——దేవా! వారెవ్వరో మానోట అనకూడదు.

చం——ఆర్య చాణక్యుడా?

కం——ఆయనగాక, మరి ఏ బతకదల్చిన వాడు మీ మాటకి ఎదురుచెబుతాడు, దేవా?

చం——(కోపంతో) సరే. మేం సుగాంగ ప్రాసాద సింహాసనంమీద ఉంటాం. చాణక్యుణ్ణే అక్కడచూస్తాం.

(అని తీవ్రంగా ఎ. ఎ. కి అడుగులు వేస్తాడు)

కం——చిత్తం. దేవా (అని కు. ఎ. కి పోతాడు)

చా——(ఆగి) చంద్రగుప్త చాణక్యులకి విరోధం వచ్చిందని రాక్షసుడు అనుకునేటట్టు చెయ్యడానికి చాణక్య గురువరేణ్యులు పన్నిన పన్నాగం కాబోలు ఇది! లేక,

దీనికి అన్యప్రయోజనం ఏమైనా ఉన్నదో! గురుదేవులవారి తంత్రం గురుదేవులవారికే తెలియాలి. ఆ వయినం నాకెం దుకూ? గురువు మనసా చెప్పాలి, శిష్యుడు శిరసా వహిం చాలి. (అని ఎ. ఎ. కి పోతాడు.)

[కు. ఎ. నించి ముందు కంచుకీ వెనకాల చాణక్యుడూ వస్తారు.]

కం—ఆచార్యదేవా! రండి.

చా—చంద్రగుప్తులవారు ఎక్కడ వేంచేశారు?

కం—సుగాంగ ప్రాసాదంలో సింహాసనం మీద అమాత్యా!

చా—సరే. అక్కడ కూచుని వారు నన్ను చూడ దల్చుకున్నారు. బాగానే ఉంది. కౌముదీ మహోత్సవం మేం ఆపేసినసంగతి వారిచెవిని పడలేదుకద!

కం—పడిందండి.

చా—(కరుకుగా) ఎవడో చెప్పినవాడు?

కం—ఆర్యా! అనుగ్రహించండి. మహారాజులుం గారే ప్రాసాదంమీదనించి పరకాయించి గ్రహించారు.

చా—అంటే, మీరే వారితో చెప్పి వారికోపం రేగ కొట్టారు.

కం—(హడిలిపోయి తలవంచి నమస్కరించి నిల బడతాడు)

చా—ఔరా ! సేవకులకికూడా చాణక్యుడిమీద ద్వేషమా! సరే. ఏరీ ఆ మహారాజులంగారూ ! సుగాంగ ప్రాసాదంలోనా ఉన్నారు. చూద్దాం! (అని కోపంతో ఎ. ఎ. కి వెళ్ళిపోతాడు)

కం—అయ్యో ! రాజుకీ మంత్రికీ చెడిపోయిందంటే, సేవకులికి చావొస్తుంది మధ్య ! సేవకావృత్తి హీనమా, మరీహీనమా ! నాకిన్నివళ్ళు గడిచాయి నాకింకా తృష్ణ చావలేదు, నేనీ వృత్తి వదులుకోలేను.

(అని నుదురు కొట్టుగుంటూ కు. ఎ. కి నిష్క్రమిస్తాడు)

[రెండో తెర లేవగా, సింహాసనంమీద చంద్రగుప్తుడు కనిపిస్తాడు. కుర్చీలుఉంటాయి. ఎ. మ. నించి చాణక్యుడు వస్తాడు]

చా—(ఎ. మ. నించి వస్తూ) చంద్రగుప్తా, దిగ్విజయం కలగాలి. సేతుహిమాచలాలమధ్య ఉండే రాజులంతా తమకిరీటాల రత్నకాంతులతో నీపాదాల్ని రంజింపజేస్తూ ఉందురుగాక!

చం—ఆర్యా! (అంటూ సింహాసనంమీంచి దిగివచ్చి చాణక్యుడి పాదాలకి మొక్కుతాడు.)

చా—(చంద్రగుప్తుడి చేతులు పట్టుగుని) వత్సా! లేచికూర్చో.

చం—తమరు ఇట్లా దయచెయ్యండి (అని పీఠంకేసి చూపించి, చాణక్యుడు కూచున్నతరవాత, తనెళ్ళి సింహాసనంమీద కూచుంటాడు.)

చా—చంద్రగుప్తా! ఎందుకూ నను రప్పించింది?

చం—మీ సుదర్శనం యొక్క అనుగ్రహం పొందడానికి.

చా—(నవ్వేసి) అబ్బోఅబ్బో! ఎంతవినయం! ప్రభువులు తమ కొలువులో ఉన్నవాళ్ళని వర్తిపుణ్యానికే కబురంపిస్తారా!

చం—అమాత్యా! కౌముదీమహోత్సవం ఆపేశారుగదా, ఏమిటి మీకొచ్చేలాభం!

చా—(వికటంగా నవ్వుతూ) అట్లాయితే, మమ్మల్ని నిందించడానికా పిలిపించావు?

చం—కాదు. మీతో విన్నవించుగోడానికి.

చా—విన్నవించుగునే శిష్యుడివి నువ్వు అయిననాడు, స్వాతంత్ర్యం గల గురువుని నేను అవుతాను.

చం—అట్లా ఆలోచించే, మిమ్మల్ని పిలిపిస్తా. ప్రయోజనం లేనిపని తమరు ఎన్నడూ చెయ్యరుగా!

చా—ఎల్లాగైతేం, కనిపెట్టావు, మొట్టుకి!

చం—కాదండి, తమరి శిష్యవాత్సల్యం గ్రహించుగుని, తమర్ని పిలిపించాను.

చా—అయితే చెబుతా, విను. రాజకార్యాలు మూడు రకాలు. రాజు చూసేవి కొన్ని, మంత్రి జరిపేవి కొన్ని, ఉభయులూ తంటాలు పడేవి కొన్ని. ప్రస్తుతాంశం రెండోరకం—అంటే మంత్రి జరిపేది.

చం—(కోపం తెచ్చుగుని, మొఖం పక్కకి తిప్పేసు గుంటాడు.)

(ఎ. మ. నించి, లోపల, వైతాళికుల
స్తోత్రాలు వినపడతాయి)

ఎవరిమూర్తి శరత్తు
విభూతి కాశాలతో అవకాశాన్ని
చంద్రాతపంతో గజచర్మఘనాల్ని
తెల్లపరిచి,
కపాలకమరుదాలతో
ప్రకాశించి
హాసహంసలతో రాజిస్తూ ఉంటుందో అటువంటి శివుడు మీ కష్టాలు తొలగించాలి!

ఆభరణాలు ధరించిన ప్రభువా ప్రభువు! తన ఆజ్ఞలన్నీ అవ్యాహతంగా సీనూదిరిగా నిర్వర్తింప చేసుగునే ప్రభువే ప్రభువు.

చం—కంచుకీ!

చా—(తనలో) ఓహో! ఆశీర్వచనం, దానితరవాత ఆజ్ఞలు నిర్వర్తింపబడడం గురించి ఎత్తిపొడుపూ! ఈవైతాళికుల్ని రాక్షసుడు పెట్టిఉంటాడు.

కం—(ఎ. మ. నించి వస్తూ) చిత్తం, మహాప్రభూ!

చం—ఆ వైతాళికుల్లో ఒకడికి శతమూ, రెండో వాడికి సహస్రమూ సువర్ణాలు ఇయ్యి.

కం—చిత్తం! (అని ఎ. మ. కి వెళ్ళబోతాడు)

చా—(తీవ్రంగా) కంచుకీ! ఆగు! చంద్రగుప్తా! ఇప్పుడు వాళ్ళకి ఎందుకు. అంతసొమ్ము ఇయ్యడం?

చం—అయినదానికీ కానిదానికీ ఆర్య చాణక్యుడు ఇట్లా అడ్డం వస్తూంటే నేను రాజునైనట్టా, లేక ఖైదీని అయినట్టా?

చా—ఈమాట, పాండిత్యంలేనిరాజు అనవలసిన మాట! అయితే, నీయిష్టం వచ్చినట్టే చేసుగో.

చం—మాపని మేం చేసుగుంటాము.

చా—మాపని మేం చూసుగుంటాము.

చం—అది సరేకాని, మహోత్సవం మీరు ఆపు చేయించిన ప్రయోజనం చెప్పండి.

చా—మహోత్సవం మీరు జరపదలిచిన ప్రయోజనం ముందు చెప్పండి.

చం—మొదటి ప్రయోజనం నా ఆజ్ఞ మన్నించబడడమే.

చా—మహోత్సవం ఆపుచెయించడంలో కూడా మొదటి ప్రయోజనం నా ఆజ్ఞ మన్నించబడడమే. ఇక రెండో ప్రయోజనం, ఏమిటంటే, (ఒక పత్రం తీస్తూ) ఈ పత్రం చూస్తేసరి (అని ఆ పత్రం చంద్రగుప్తుడికి యిస్తాడు)

చం—(చూసి) చూశాను. అనేకులు మనల్ని విడిచి మలయకేతువుని ఆశ్రయించారు.

చా—అవును

చం—గజాధ్యక్షుడుగా ఉండే భద్రభటుడు...

చా—అతడికి స్త్రీవ్యసనం. అతణ్ణి నేనే ప్రోత్సహించాను, వెళ్ళి అక్కడ చేరాడు.

చం—అశ్వాధ్యక్షుడైన పురుషదత్తుడు...

చా—అతడికి మృగయావ్యసనం. తీసేశాను.

చం—డింగరాత, బలగుప్తులు...

చా—వాళ్ళకి వేతనాలు చాలవుట—లేచిపోయారు.

చం—నా బాల్యసేవకుడుగా ఉంటూండే రాజసేనుడు...

చా—అతడు స్వంతంగా చతురంగబలం సమకూర్చుకున్నాడట. అది మనం లాక్కుంటాం అని తెలిసిందట—ఉడాయించాడు.

చం—భాగురాయణుడు ?

చా—చందనదాసుకి ఏంగతి పట్టిందో ఆ గతే తనకీ పడుతుందని తోచిందిగావును—దయ చేశాడు.

చం—లోహితాక్ష విజయవర్మలు ?

చా—నువ్విచ్చిన దాయాదం గ్రహించడం వాళ్ళ ఆత్మగౌరవానికి భంగకరంట—నిష్క్రమించారు.

చం—ఇన్నీ తెలిసి మీరు ఊరుకున్నారేం ?

చా—ప్రతిక్రియ చెయ్యడానికి వీలులేదు.

చం—వీల్లేకా, చేతకాకా ?

చా—చేత కాక కాదు.

చం—ఉద్దేశించే ఊరుకున్నారా ?

చా—ఆ

చం—ఏమిటి ఆ ఉద్దేశం ?

చా—జాగ్రత్తగా విను. మనపక్షం వాళ్ళుఉంటూ మనమీద అనురాగం తప్పినవాళ్ళమీద ప్రతిక్రియ రెండు విధాలు. అనుగ్రహం చూపించడం, నిగ్రహం చూపించడం. కాని ఇప్పుడు మనం ఆలోచించినవాళ్ళమీద అనుగ్రహం చూపించడం మొదలుపెట్టామా, వాళ్ళని తృప్తిపరచడం మన తరంకాదు. లేక, వాళ్ళమీద నిగ్రహం చూపించి వాళ్ళని దండించామా, నందకులాన్ని అభిమానించే వాళ్ళకి మనం అంటే విశ్వాసం పోతుంది. పైగా, రాక్షసమంత్రాంగ బలంతో మలయకేతువు మనమీద పడబోతున్నాడు. ఈ గడ్డుసమయమా, కౌముదీమహోత్సవానికి తరుణం ?

చం—ఆర్యా ! మేం మిమ్మల్ని చాలా అడగాలి.

చా—వత్సా! మేం నీతో చాలా చెప్పాలి.

చం—సరే. మలయకేతువు వెళ్ళిపోతూంటే మీరు తెల్లపోయి ఊరుకున్నారేం ?

చా—అతణ్ణి చంపిస్తే అతడి తండ్రిని చంపింది మనమే అని స్థిరపడుతుంది. లేక, అతడికి అర్ధరాజ్యం ఇస్తే, అతడి తండ్రి గతించిన ఫలం ఏమిటి ? కాబట్టి, అతణ్ణి హింసించాలేదు, ప్రశంసించాలేదు.

చం——సరే కానీండి. కాని, రాక్షసుడు ఇక్కణ్ణించి లేచిపోతూంటే మీరు కళ్ళప్పగించి చూస్తూ ఉండి పోయారేం ?

చా——రాక్షసుడంత స్వామిభక్తీ జనానురాగమూ బుద్ధి ప్రజ్ఞా అంగబలమూ గలవాడు కుట్రచేస్తూ రాజధానిలో ఉండడంకంటె, దూరానికి పోయి కుట్రమానక పోయినా అతణ్ణి లొంగదియ్యడం తేలికేమో—అని

చం——పోనీ, మీరు పట్టుగోక పోయారా, రాక్షసుణ్ణి !

చా——సరే. బాగానేఉంది. రాక్షసుణ్ణి పట్టుగోడం మాటలా ? రాక్షసుడు, రాక్షసుడు. అతణ్ణి పట్టుగోడానికి యత్నిస్తే, మన సేనల్లో కొన్ని మట్టం అయినాయన్న మాటే. అది మనికి మంచిది కాదుగదా. లేక అతడు చచ్చిపోవచ్చు. అది మన ఎత్తు కాదుగదా. అంత తెలివిగల మంత్రి మళ్ళీ ఎట్లా దొరకుతాడూ ?

చం——అయ్యా ! నోరుమీది ! అయినాసరే. రాక్షసుడే గొప్పవాడు.

(విరాధగుప్తుడు పొంచిఉండి సంభాషణ
వింటూన్నట్టు సభవారికి కనపడాలి)

చా——(కోపంగా) అనగా, నాకంటె గొప్పవాడు. ఏమిటి అతడి యోగ్యతా ?

చం—అతడు కృత్రిమ తోరణం కట్టించాడు. పడక గది గోడల్లో చారుల్ని ప్రవేశపెట్టాడు. మారణోపాయాలు ఎన్నో పన్నాడు.

చా—(వికటంగానవ్వి) అదా అతడి యోగ్యత! అందుకా నీసంతోషం! సరే సంతోషిస్తూ కూచో! నంద రాజ్యం నేను నీ కిప్పించినట్టే, నీరాజ్యం మలయకేతువుకి ఇప్పిస్తానని ప్రతిజ్ఞ చేశాడట రాక్షసుడు.

చం—సరి సరి. నందరాజ్యం నాకు రావడానికి మీరు చేసిందేమిటి పోదురూ!

చా—అప్పటికిగాని జుట్టు ముడేసుకోనని ప్రతిజ్ఞ చెయ్యలేదూ? రాజు నీతిశాస్త్రం ప్రయోగించలేదూ?

చం—అవా కారణాలు, నాకు రాజ్యం రావడానికి! నాకు రాజ్యంరావడానికి కారణాలు నా అదృష్టమూ నందుల దురదృష్టమూనూ!

చా—అదృష్ట దురదృష్టాల్ని గణించేవాడు విద్వాంసుడు కాడు.

చం—ఆత్మస్తుతి చేసుకునేవాడూ విద్వాంసుడు గాడు.

చా—(చాలాకోపంతో) ఓరి నీచా! ఇదుగో మళ్ళీ విప్పెయ్యగల్ను జుట్టు! జాగర్త! నాకోపం నందుల్ని కాల్చేసి చల్లారిపోతూంటే దాన్ని పూర్తిగా చల్లారనియ్యకుండా, నువ్వు రాజుననుకుంటూ రాజేస్తున్నావు సరే.

నువ్వు రాక్షసుణ్ణే మంత్రిగా ఏర్పరుచుకో. ఇదిగో కత్తి (అని ఖడ్గం గిరవాటేసి కు. ఎ. కి పోతాడు)

చం—(చాణక్యుడు కేసి చూస్తూ, సాధారణవ్యక్తి అయిపోయి) గురుదేవుడికి నిజంగా రాలేదుకద కోపం! అయ్యొయ్యో! గురు ధిక్కారం అభినయించినందుకే నాకు తల నేలనిపెట్టి కొట్టుకోవాలని ఉంది. ఇక గురు ధిక్కారం బుద్ధిపూర్వకంగా చేసేవాళ్ళు ఏంశిక్ష అనుభవిస్తే సరిపోతుందో! వెళ్ళి గురుదేవుడి పాదాలు ఆశ్రయిస్తాను. (అంటూ కు. ఎ. కి వెడతాడు. తెర)

## రంగం-4

[రెండవ ద్వార ఎదట, మలయకేతు డి పురం కు. ఎ. నించి చేతులు కట్టుగుని, ఆలోచిస్తూ, కిందిచూపు చూస్తూ మెల్లిగా అడుగులు వేసుగుంటూ మలయకేతు వస్తాడు]

మ—(కు. ఎ. నించి వస్తూ) ఔరా! నా అవస్థ! నాతండ్రి పర్వతేశ్వర మహారాజు కైలాసం అలంకరించి పదినెలలైంది. నా తల్లుల కన్నీళ్ళు లేచి వెళ్ళి శత్రుభార్యల కళ్ళల్లో ప్రవేశించేటట్టు చేస్తాను. లేకపోతే యుద్ధభూమి నించి వెనక్కి రానేరాను—అని నా ప్రతిజ్ఞ. రాక్షసమంత్రి నాకు దొరకడమే ఆశారేఖ! వెళ్ళి ఆయన్ని మళ్లీ చూస్తాను. (వెనక్కి తిరిగి) భాగురాయణా!

భా—(కు. ఎ. నించి వస్తూ) ఏమిటి, నాయనా!

మ—తక్కిన వాళ్లందర్నీ పొమ్మన్నాను. నువ్వొక్కడవ్వూ నాతో, రా.

భా—అట్లానే.

భా—రాక్షసామాత్యుడికి తలనెప్పి వచ్చిందట. చూసి వద్దాం.

భా—సరే.

మ—(ఎ. ఎ. వైపు ఒక అంగ వేసి) భాగురాయణా!

భా—ఏమిటి కుమారా!

మ—భద్ర భటుడు పురుషదత్తుడు మొదలైనవాళ్ళు చంద్రగుప్తుడికి అత్యంత మిత్రులు కారూ ?

భా—కాకపోవడమే ! చాలా ఆప్తులు.

మ—అంతదగ్గిరవాళ్ళు చంద్రగుప్తుణ్ణి వదిలేశా రెంచేతో !

భా—ఏమో ! బహుశా, ఆ దుష్ట చాణక్యుడి ఒత్తిడి పడలేక పోయారేమో !

మ—వాళ్ళంతా నన్నాశ్రయించడానికి కారణం ఏమిటో !

భా—కారణాని కేముందీ ! సుగుణసంపద ఆశ్రితుల్ని ఆకర్షిస్తుంది.

మ—వాళ్ళు నాకు ఒక విన్నపం చేశారుస్మీ.

భా—ఏమనీ ?

మ—మీ సేనాపతి శిఖరకుడి ద్వారా మిమ్మల్ని ఆశ్రయించాంగాని మేము, అమాత్య రాక్షసుడి ద్వారా కాదు, మహాప్రభో ! ఆ సంగతిమాత్రం కొంచెం జ్ఞాపకం పెట్టుగోండి తమరు—అని

భా—వాళ్ళ విన్నపం చాలా సమంజసంగా ఉంది.

మ—ఆ విన్నపం చాలా సమంజసంగా ఉందా ? వాళ్ళు ఇల్లా అనడంలో వాళ్ళ ఉద్దేశం ఏమిటో నాకు బోధపడటం లేదు.

భా—వాళ్ళ ఉద్దేశం గ్రహించడం అంత మరీకష్టం. కాదే !

మ—కష్టం కాదూ? అయితే, నీకు తెలిస్తే చెప్పు.

భా—తెలియడానికి ఏముందీ? గొప్పవాళ్లని ఆశ్రయించ వలిసొచ్చినప్పుడు ఆ గొప్పవాడియొక్క పరమ హితుడి ద్వారా ఆశ్రయించాలి.

మ—నిజమే. కాని, రాక్షసామాత్యుడు నందుడికి పరమహితుడు కాడా?

భా—ఏమో! అదినీకు తెలియాలిగాని, వాళ్ళకెట్లా తెలుస్తుందీ? వాళ్ళు ఎట్లా ఆలోచించారో!

మ—ఎట్లా ఆలోచించి ఉంటారూ?

భా—ఒకలాఅయి ఉంటుంది. ఈ రాక్షసుడికి అటు శత్రువెవరు? చంద్రగుప్తుడా చాణక్యుడా?

మ—చాణక్యుడు.

భా—అతడికి తగని గర్వం అని నీకు తెలుసా?

మ—తెలుసు.

భా—మహారాజు గర్విష్ఠి మంత్రితో ఎంతకాలం వేగుతాడూ?

మ—వేగలేడు, నిజమే.

భా—కనక అటువంటి వాళ్ళని మహారాజు తొలిగించేస్తాడు. అప్పుడు, స్థితి మారిపోతుంది.

మ—స్థితి ఎట్లా మారిపోతుందీ?

భా—రాక్షసుడు నందభక్తుడు గనక, నందవంశీయుడైన చంద్రగుప్తుడితో సంధి చేసుగోవచ్చు!

మ—అవును సుమా !

భా—కాబట్టి, ఆ మాదిరిగా పారిపోగల రాక్షసుడి ద్వారా నిన్ను ఆశ్రయిస్తే నీకు ఎట్లాంటి సందేహం మన స్సులో పుడుతుందో అని భయంవేసి, 'రాక్షసామాత్యుడి ద్వారా నిన్ను ఆశ్రయించడంలేదు, మేము'-అని నీతో విన్న వించుకుందాంఅని భద్రభటాదులు ఆలోచన చేసి ఉండవచ్చు.

మ—కావచ్చు. (అని ఎ. ఎ. కి నడచి, నిష్క్ర మించి అప్పుడే వెనక్కి వచ్చి) అమాత్యుడి దర్శనంకోసం ఎవడో కుసుమపురంనించి వచ్చినట్టు దౌవారికుడు అమాత్యు డితో చెబుతున్నాడు. వాళ్ళ సంభాషణవల్ల రాక్షసుడి హృదయం మనికి తెలుస్తుంది. ఈ స్థలంలో దాక్కుని వాళ్ళ సంభాషణ ఆలకించి, సకాలానికి లోపలికి వెళదాం.

(అని ఎ. ఎ. కి నిష్క్రమిస్తారు).

[రెండో తెర లేస్తుంది. రాక్షసుడు కూచుని ఉంటాడు. అతడి కుడిపక్క శకటదాసు ఉంటాడు. ఎ. మ. నించి కరభకుడు వచ్చి నమస్కరిస్తాడు]

క—(ఎ. మ. నించి వస్తూ) అమాత్యశేఖరా, జయం.

రా—రా. కూర్చో ! (అని కళ్ళుమూసి జ్ఞాపకం చేసుగోడం అభినయించి) ఆ. విరాధగుప్తా!

వి—స్వామీ, నేనే.

రా—కార్యం ఫలించిందా ?

వి—ఫలించింది, స్వామీ.

రా—వైతాళికుడు సకాలంలో ఉచితంగా వ్యవహరించాడా?

వి—చిత్తం. చంద్రగుప్తుడి ఆజ్ఞ తోసిరాజైపోయే సమయం కనిపెట్టి, ఆజ్ఞలు నిర్వర్తింప చేసుకోడంలో చంద్రగుప్తుడు అద్వితీయుడని పొగిడేశాడు.

రా—బాగుంది, మహా చక్కనిసమయం వెతికాడు. చంద్రగుప్తుడిఆజ్ఞ ఏమని?

వి—నంద నాశనంగురించి దుఃఖిస్తూన్న ప్రజలకి ఉత్సాహం పోసే నిమిత్తం కౌముదీ మహోత్సవం జరిపించాలని చంద్రగుప్తుడి ఆజ్ఞ.

రా—ఆ ఆజ్ఞ తోసిరాజు ఎట్లా అయిందీ?

వి—ఆ ఉత్సవం ఆపెయ్యాలని చాణక్యుడి ఆజ్ఞ.

రా—ఈ రెండాజ్ఞలూ పరస్పర విరుద్ధంగా ఉన్నాయే?

వి—ఒకరి సంగతి మరొకరికి బోధపడిం తరవాత చెల్లవలిసింది ఎవళ్ళ ఆజ్ఞా అని వాళ్ళు పట్టింపులు పోతూండే సమయం కనిపెట్టి, వైతాళికుడు, 'ఆభరణాలు ధరించిన ప్రభువా ప్రభువు! తన ఆజ్ఞ లన్నీ అవ్యాహతంగా, నీమాదిరిగా నిర్వర్తింప చేసుగునే ప్రభువే ప్రభువు!' అని స్తుతించాడు.

రా—చాలా సమంజసంగా ఉంది. పర్యవసానం?

వి—చంద్రగుప్తుడు చాణక్యుణ్ణి మంత్రిపదవిలోంచి బహిష్కరించేశాడు, స్వామీ.

రా—చంద్రగుప్తుడి కోపానికి కారణం, ఆ ఉత్సవం జరిపించడంలో బయల్దేరిన అభిప్రాయ భేదమేనా, మరేమన్నా ఉందా?

వి—ఉంది, స్వామీ. మలయకేతువు ఊళ్లోంచి వెళ్ళిపోతూంటే చాణక్యుడు తెల్లపోయి ఊరుకున్నాడని కూడా చంద్రగుప్తుడికి కోపం వచ్చింది.

రా—(సంతోషంతో) శకటదాసూ! ఇక చంద్రగుప్తుడు నాకు లొంగవచ్చు. చందనదాసుకి మోక్షం కలగచ్చు. జీవసిద్ధి తెరిపిని పడచ్చు. సరే. ఇప్పుడు చాణక్యుడు ఎక్కడున్నాడూ?

వి—అరణ్యంలోకి పోయి తపస్సు చేసుగుంటాడని అంటున్నారు.

రా—సరే. శకటదాసూ! ఇతణ్ణి కొంచెం విశ్రమింపచెయ్యి. నేను కుమార మలయకేతువుని చూడ్డోస్తున్నానని కబురుచెయ్యి.

శ—చిత్తం (అని విరాధగుప్తుడితో ఎ. ఎ. కి నిష్క్రమించి, వెంటనే తనొక్కడూవచ్చి) అమాత్యా! కుమార మలయకేతువు మీదర్శనం నిమిత్తం వచ్చి కనిపెట్టుగుని ఉన్నాడు.

రా—(తొందరగా) అతడే వచ్చాడా? ఇకనేం. త్వరగా తీసుగురా.

శ—(వెళ్ళి మలయకేతువుని తీసుగొస్తాడు)

రా—(లేచి) మలయకేతువుకి ఎదురువెళ్ళి వత్సా! రా! కూర్చో.

మ—(కూర్చుని) ఆర్యా! మీ తలనెప్పి తగ్గిందా?

రా—కుమారా! నీకు కుమారశబ్దం పోయి, రాజశబ్దం రావాలి, నాతల నెప్పి తగ్గాలి.

మ—తమరు సంకల్పిస్తే అదెంత? కాని, నేసల్ని ఆయత్తం చేసుగుని ఇల్లా ఎంతకాలం నేను కూర్చోనూ అని ఆలోచిస్తున్నాను.

రా—మరి కూర్చో అక్కర్లేదు. విజయప్రయత్నం చెయ్యి.

మ—అందుకు ఇది తరుణమేనా?

రా—మంచి తరుణం. చంద్రగుప్తుడు చాణక్యుణ్ణి మంత్రిపదవిలోంచి తొలగించేసిన తరుణం. చంద్రగుప్తుడు మనకి చేజిక్కే తరుణం.

మ—ఏమో! మంత్రితో విరోధంవస్తే రాజుకి లోటేమిటి, అమాత్యా!

రా—నిజమే, సాధారణంగా! కాని, ఈ చంద్రగుప్తుడి విషయంలో అట్లాకాదు.

మ—ఆర్యా! చాణక్యుడు పోతే, చాణక్య శత్రువులైన మంత్రులు పరిగెట్టి చంద్రగుప్తుడితో ఏకం అవుతారు. చంద్రగుప్తుడికి లోటు ఎన్నడూ ఉండదు.

రా—ఉంటుంది. ఆలోటు ఎట్లా ఉంటుందో విను. చాణక్యశత్రువు లైన మంత్రుల్లో నంద వంశాభిమాను లుండవచ్చుగదా. వాళ్ళు చంద్రగుప్తద్వేషి ఏవంటివాడు ఉంటూన్నప్పుడు, నిన్ను చేరుకుంటారుగాని, ఆ చంద్ర గుప్తుణ్ణి ఆశ్రయించరు. కుమారా! నేను ఒక తార్కాణ కాదా?

మ—సరే. చంద్రగుప్త చాణక్యులకి వైరం వచ్చింది గదా అనేనా మరో కారణం ఏదేనా ఉందా, మనం ఇప్పుడే చంద్రగుప్తుడి మీద దాడిచెయ్యడానికి?

రా—ఇతర కారణాలు వెయ్యి ఉండనీ. ప్రధాన కారణం ఇదీ!

మ—ప్రధాన కారణం ఎట్లా అవుతుంది ఇదీ! మంత్రిత్వం కూడా తను చూసుగుంటూ మనకి ప్రతిక్రియ చెయ్యలేనంతటి అసమర్థుడా చంద్రగుప్తుడు?

రా—ఆ. అక్షరాలా అసమర్థుడే. అతడు ప్రతీదానికీ ఆ చాణక్యుడి మీదే ఆధారపడతాడు.

మ—అయి ఉండచ్చు, కాని, ఒక రాజుకీ అతడి మంత్రికీ ఏర్పడ్డ వైరంవల్ల కలిగిన చిక్కు సందడిలో దాడి చేసే శత్రురాజుకి విజయం దక్కుతుందా?

రా—ఓ. తప్పకుండా దక్కుతుంది. నీకు విజయంరాజ్యం.

మ—అంతే అంటారా?

రా—నిశ్చయంగా. ఏమంటే! నువ్వా సేనానివి. ప్రజలా, నందవంశ భక్తులు. చంద్రగుప్తుడా, నిన్నటివాడు.

చాణక్యుడా, పదభ్రష్టుడు. ఈ రాక్షసుడా, నీకు మంత్రి. కాబట్టి విజయం నీది, సామ్రాజ్యం నీవశం. నువ్వు దాడీ చెయ్యడమే తడవు, అనుజ్ఞ ఇయ్యడమే తరవాయి.

మ—తమరు, ఇదే తరుణం అని, ఇంతగా చెబుతూన్నప్పుడు, నేను మరి ఊరుకోను. సెలవియ్యండి. దాడీ బయల్దేరతాను.

రా—మంచిది.

మ—(రాక్షసుడి సెలవు తీసుకుని, రీవిగా ఎ. ఎ. కి వెడతాడు)

రా—(ఏదో పత్రం తీసిచూసి) ప్రయాణానికి లగ్నం. ఈవేళ సాయంత్రం—పూర్ణ చంద్రోదయ కాలం—కేతువు ఉదయాస్తమానాల ఏకీభావక్షణం—బుధలగ్నం! ఇది ఎట్లా రహితం?...క్షపణకా!

క్ష—(కు. ఎ. నించి వస్తూ, నమస్కరిస్తూ) చిత్తం, దేవా!

రా—ఏమిటిదీ! ఈ తిధి మంచిది కాదే?

క్ష—అమాత్యా! తిధిగుణానికి అరవై నాలుగు రెట్లు లగ్నగుణం! చంద్రబలం వల్ల మీ కార్యానికి సిద్ధి.

రా—ఓ అట్లానా! సరే.

క్ష—చిత్తం.

(తెర)

## రంగం-5

[మలయకేతు శిబిరం. కు. ఎ. నుంచి ఆలోచనవల్ల కృశించినట్టు కనిపిస్తూ మలయకేతు ప్రవేశిస్తాడు]

మ—(కు. ఎ. నుంచి వస్తూ) అబ్బ! ఈ రాక్షస మంత్రి సంగతి చూడగా చూడగా నా మనస్సు కుమ్మరి చక్రం అయిపోతుంది. అతణ్ణి నమ్మడానికీ లేదు, నమ్మక చేసేదీ లేదు. (ఎ. ఎ. కి నడిచి) భాసురకా!

భాసు—(ఎ. ఎ. నుంచి వస్తూ) చిత్తం, దేవా!

మ—భాగురాయణుడేడీ?

భాసు—గ్రామాంతరం వెళ్ళదల్చిన వాళ్ళకి ముద్రా చిహ్నం కొట్టి పత్రాలు ఇస్తున్నాడండి.

మ—సరే. నేనిక్కడ కొంతసేపు విశ్రమిస్తున్నానని అతనితో చెప్పిరా.

భాసు—చిత్తం. (అని ఎ. ఎ. కి పోతాడు)

మ—(కు. ఎ. కి నిష్క్రమిస్తాడు)

(అప్పుడే భాగురాయణుడు ఎ. మ. నుంచి వచ్చి కూర్చుంటాడు)

కాగితాలు సవిరిస్తూంటాడు. క్షపణకుడు ఎ. ఎ. నుంచి వస్తాడు.

క్ష—(ఎ. ఎ. నుంచివస్తూ) ఆర్యా! నమస్కృతి.

భాగు—ఏమిటి సంగతి? ముద్రా చిహ్నం నీకూ కావాలా?

క్ష—చిత్తం.

భాగు—ఎవరి పనిమీద వెడుతున్నావు? రాక్షస మంత్రిపనా?

క్ష—పాపం శాంతించాలి, మహాశయా. నెవల్లే చోట రాక్షసుల పేరూ ఉండదు, పిశాచాలపేరూ ఉండదు.

భాగు—రాక్షస మంత్రిమీద అంత కోప పడుతున్నావే? ప్రణయ కోపమా?

క్ష—ఆయనమీద ఏకోపమూ లేదు నాకు. నా మీదే నాకు కోపం.

భాగు—నీ మీదే? అదేం కర్మం?

క్ష—దిక్కుమాలిన పని చేశాను, చేతులారా చేశాను. అది తల్చుగుంటే నామీద నాకు కోపం వస్తోంది.

భాగు—అదా? మేం కూడా వినచ్చా ఆపని?

క్ష—వినడానికి అభ్యంతరం లేదుకానండి, అది మీరు వింటే వచ్చేలాభం ఏమిటి, వినకపోతే కలిగేనష్టం ఏమిటి, పోనిస్తురూ!

భాగు—అది అంత రహస్యం అయితే, నువ్వే దాచుకో బాబూ, నాకెందుకు.

క్ష—అబ్బెబ్బే, అది రహస్యం అని అనటంలేదండీ, నేనూ, అది చాలాక్రూరంగనక శాధ.

భాగు—అయితే, చెప్పేయ్, వింటాను.

క్ష—పోనీ ఎందుకు లేస్తురూ, నేను చెప్పను.

(మలయకేతు కు. మ. కి. వచ్చి పొంచి వింటూండాలి)

భాగు—సరే సరే. నీలో ఏదోవుంది. ఓ మాటు ఇటూ ఓ మాటు అటూ నువ్వు ఊగిసలాడుతున్నావు. నీ మనస్సులో ఉన్నది నువ్వు చెప్పకపోతే నీకు ముద్రా చిహ్నం ఇవ్వను.

క్ష—బాబో! ముద్రా చిహ్నం గనక మీరు తక్షణం నాకు ఇవ్వకపోతే, నాకు చాలాచిక్కు తటస్థిస్తుంది.

భాగు—అందుకనే నీ హృదయంలో సంగతి విప్పి చెప్పి ముద్రాచిహ్నం పట్టికెళ్ళు.

క్ష—అయ్యో! నాకు ఎంత తప్పనిసరి తంటా వచ్చిందీ! అయితే వినండి. చుట్టు పట్ల మరెవరూ లేరుకద!

భాగు—ఎవ్వరూ లేరు, చెప్పు.

క్ష—నేను పాటలీ పుత్రంలో ఉండేటప్పుడు రాక్షసు డికి చాలా దగ్గిర స్నేహితుణ్ణి. అప్పట్లో విషకన్య మూలంగా పర్వతేశ్వరుడు చచ్చిపోయాడే, ఆ ప్రయోగంచేసిన వాణ్ణి నేనే! చెయించినవాడు రాక్షసుడే!

(మలయకేతువు గుండెలుబాదుకుని, లోపలికిపోయి, మళ్లీవింటూన్నట్టు కొద్దిగా తల కనపరచాలి)

భాగు—అప్పుడు చాణక్యుడు ఊరుకున్నాడా?

క్ష—ఊరుకుంటాడా వెంటనే నన్ను ఊళ్ళోంచి లేవ గొట్టేశాడు.

భాగు—మేం అట్లా వినలేదయ్యా! తన వాగ్దాన ప్రకారం పర్వతేశ్వరుడికి అర్ధరాజ్యం ఇయ్యవలిసొస్తుందని పర్వతేశ్వరుణ్ణి చాణక్యుడే చంపించేశాడంటారు, మరి.

క్ష—(చెవులుమూసుగుంటూ) పాపం శాంతించాలి, మహానుభావా, పాపంశాంతించాలి. అదంతా చివరంటా నిర్వహించిన వాణ్ణి నేను, కానుటండీ! నాకు తెలియదూ! చాణక్యుడు 'విషకన్య' అనేమాట కుడా విని ఎరగడు.

భాగు—ఇదా నీ మనస్సులోబాధా! బాగానేఉంది. ఇదుగో (అని ఒక పత్రంమీద ముద్దర వేసి) ముద్రాచిహ్నం, తీసుగో. కాని, ఒఖపసిచేసి మరీవెళ్ళు. ఈసంగతి కుమార మలయకేతువుతో చెప్పి మరీవెళ్ళు (అని కు. మ. కేసి వెళ్ళబోతాడు).

మ—(కు. మ. నించి విచారంతో వస్తూ) ఏమీ చెప్పక్కర్లేదు. పిడుగులాంటి ఆవార్త ఇప్పుడే నా చెవిని కూడా పడింది.

క్ష—అయితే సెలవియ్యండి (అని ఎ. ఎ. కి నిష్క్రమిస్తాడు).

మ—ఔర, రాక్షసా, రాక్షసా! నువ్వెంత సార్ధక నాముడవురా!

భాగు—కుమారా! ఇది ధైర్యంగా ఉండవలసిన సమయం! గుండె చెదరగొట్టుకోకు. ఇట్లా కుంచో్చ. నీతో ఒకమాట చెప్పాలి.

మ—(కూర్చుంటూ) మిత్రమా ! ఏమిటి ?

భాగు—నువ్వేమీ తొందరపడకుండా నిదానించి ఆలోచించాలి. రాజనీతి ఆచరించే టప్పుడు వావీ వరసా గణించరు. అప్పట్లో రాక్షసుడు సర్వార్థసిద్ధిని సింహాసనం ఎక్కించ దల్చుకున్నాడు. తత్క్షణం రాక్షసుడి దృష్టికి ఇద్దరు శత్రువులు స్ఫురణకి వచ్చి ఉండచ్చు — ఒకడు చంద్రగుప్తుడూ, రెండోవాడు పర్వతేశ్వరుడూ. వీళ్ళిద్దర్లోనూ శక్తి సామర్థ్యాలూ పేరుప్రతిష్టలూ కలవాడు పర్వతేశ్వరుడే గనక, చంద్రగుప్తుడి కంటె పర్వతేశ్వరుడే తనకి ఎక్కువ అడ్డుగా పరిణమించవచ్చు నని రాక్షసుడికి తోచడంవల్ల రాక్షసుడు పర్వతేశ్వరుణ్ణి పొట్టని పెట్టుగున్నాడేమో ! రాజకీయంలో శత్రువులు మిత్రులూ మిత్రులు శత్రులూ అవడమే కాదు, ఒకే వ్యక్తియొక్క ఒకేజన్మలో జన్మాంతరాలుకూడా ఏర్పడుతూండి, ప్రతీ జన్మాంతరం లోనూ పూర్వ జన్మాంతరకృషి వ్యర్థం అవుతూండడంకూడా జరుగుతుంది.

మ—సందేహం లేదు. రాక్షసుడు అంతే చేసి ఉంటాడు. ఏమిటి కర్తవ్యం ?

భాగు—నీకు రాజ్యం చేజిక్కేవరకూ, రాక్షసుణ్ణి ఏమీ అనకూడదు, ఏమీ చెయ్యకూడదు.

మ—ఈ ఆలోచన చాలా సమంజసంగా ఉంది. ఈరీతిగా చేద్దాం.

(ఎ. ఎ. నించి భాసురకుడు ముందు రాగా, అతడి వెనకాల సిద్ధార్థకుడు బంధింపబడి తలవంచుగుని వస్తాడు)

భాసు—దేవా, జయం. ముద్రాచిహ్నం లేకుండా, వీడు, మన నగరంలోంచి బయటికి వెడుతూండగా మన కావలివాళ్ళు పట్టుగున్నారు.

భాగు—(ఆశ్చర్యం సూచించి) సరే. వీణ్ణి ఇక్కడ ఉండనీ, నువ్వు వెళ్ళు.

భాసు—(ఎ. ఎ. కి పోతాడు)

భాగు—నువ్వు కొత్తవాడివా, లేక ఇక్కడఎవరి కేనా సేవకుడివా ?

సి—(భయంనటించి) నేను, అమాత్య రాక్షసుడికి సేవకుణ్ణి.

భాగు—అయితే ముద్రాచిహ్నం లేకుండా ఎట్లా పోతున్నావు ?

సి—పని తొందరలో

భాగు—ఎంతపని తొందర అయితేమాత్రం! రాజ శాసనం అతిక్రమించావే !

మ—భాగురాయణా ! వాడిచేతిలో పత్రం ఏదో ఉంది. ముందు అది ఊడలాక్కో !

భాగు—(సిద్ధార్థకుడి చేతులో ఉన్న పత్రం లాగి పుచ్చుగునిచూసి) కుమారా ! ఇది ఒక ఉత్తరం. దీనిమీద రాక్షసుడి ముద్రఉంది.

మ—(ఆశ్చర్యంతో కనుబొమలెత్తి) అట్లానా ! సరే. ఆ ముద్ర చెడకుండా ఉత్తరం చింపి చూడు.

భా—(అలాగే అది చింపి) కుమారా ! ఇదుగో (అని లోపలిపత్రం మలయకేతువుకి ఇస్తాడు.)

మ—(అది తీసుగుని చదువుతాడు) "శుభం. మన పగవాణ్ణి లేవగొట్టి నీ మాట నిలబెట్టుకున్నావు. మన సంధి విషయంలో తోడ్పడ్డ అయిదుగురికీ నువ్వన్న ప్రకారం, సొమ్ము పంపించు, వాళ్ళు నీకు దాసులే. సహాయకుల్లో కొందరు రాష్ట్రమూ కొందరు హస్తిబలమూ కోరుతున్నారు. నగలు మూడూ చేరాయి. ఈ పారితోషికం స్వీకరించు. ఇతడు కొంత చెబుతాడు. విను."

భాగురాయణా ! ఏమిటి ఈ మహాదారుణం ?

భా—(సిద్ధార్థకుడితో) ఇది రాసినవా రెవరూ ?

సి—దేవా, నేనెరగనండి.

భాగు—ఛీ పశువా ! అబద్ధమాడకు. నాలిక చీలింపించగల్ను. అది సరేకాని, ఏదో కొంత చెబుతావుట. ఎవరితో ?

సి—(వణుకుతూ) తమతో.

భాగు—మాతోనా ?

సి—అయ్యా ! నాకు భయం వేస్తోంది. నాకు ఏమీ తెలియడం లేదు.

భాగు—(కోపం దాల్చి) తెలియడం లేదూ! అట్లానా! భాసురకా, వీణ్ణి అటు తీసికెళ్ళి తన్నించి తీసుకురా.

భాసు—ఎ. ఎ. నించి వచ్చి, సిద్ధార్థకుణ్ణి తీసుకు పోయి, తన్నినట్లు దాఖలాగా సిద్ధార్థకుడి గోల వినిపించగా, మళ్ళీ అప్పుడే వచ్చి) స్వామీ! వాణ్ణి కొడుతూన్నప్పుడు వాడు గింజుకోగా, వాడి జబ్బకిందినించి ఈ చిన్నపెట్టె కిందపడింది.

భాగు—(నిర్ఘాంతపోతూ) కుమారా! దీనిమీద కూడా ఉందే రాక్షస ముద్రా!

మ—ఈ పెట్టెలోది, ఉత్తరంలో చెప్పిన పారితోషికం అయి ఉంటుంది..ముద్ర చెడకుండా, పెట్టె తెరు.

భాగు—(పెట్టె తెరిచి అందులోఉన్న హారం మలయకేతుకి ఇస్తాడు.)

మ—ఈ హారం నేను రాక్షసుడికి ఇచ్చినదే. మరి అనుమానం ఎందుకూ? ఈ ఉత్తరం తప్పకుండా రాక్షసుడు చంద్రగుప్తుడికే పంపిస్తున్నాడు.

భాగు—అదీ నిమిషంలో స్థిరపడుతుంది. భాసురకా! మరోమాటు వీణ్ణి ఒత్తుగా బాధించి తీసుగురా.

భాసు—(ఎ. ఎ. నించి వచ్చి. సిద్ధార్థకుణ్ణి తీసుకు పోయి, తన్నినట్టు తార్కాణగా సిద్ధార్థకుడి గోల వినిపించగా, మళ్ళీ అప్పుడే వచ్చి) అయ్యా! ఇక వీడు సత్యం చెప్పేస్తాడట. మరి దెబ్బలబాధ పడలేడ్డట.

రా—సరే. చెప్పకేం జేస్తాడులే. నాచక్కగా చెబుతాను. నువ్వెళ్ళి రాక్షసామాత్యుణ్ణి ఒకసారి తీసుకురా.

భాసు—చిత్తం (అని ఎ. ఎ. కి వెడతాడు.)

సి—(మలయకేతు పాదాలమీద పడి) మహారాజా! నాకు అభయం ఇయ్యాలి తమరు.

మ—నువ్వు దూతవుకదా! భయంలేదు, చెప్పు.

సి—దేవా, నిజంగా, ఈ ఉత్తరం ఇదీ యిచ్చి, అమాత్యరాక్షసుడు, నన్ను, పంపిస్తూంటూ, చంద్రగుప్తుడి దగ్గిరికే!

మ—ఔర! నేను అల్లానే అనుకున్నాను సరిగ్గా. ఇక నువ్వు చెప్పవలిసినమాటలు? అవి ఏమిటీ?

సి—ఆ మాటలాండీ! "నాకు అయిదుగురు చిత్ర వర్మ సింహనాధ పుష్కరాక్ష సింధుసేన మేఘుకోశులు అనే రాజస్నేహితు లున్నారు. వీళ్ళల్లో కొందరికి మలయకేతు రాష్ట్రమూ కొందరికి మలయకేతు యొక్క ఏనుగు దళమూ కావాలిట. నువ్వు చాణక్యుణ్ణి సాగనంపేసి నాకు సంతోషం కలిగించినట్టుగానే ఈ రాజస్నేహితుల కోరికలు కూడా సఫలంచేసి, నన్నానందపరుచు"—అని.

మ—ఔరా! చిత్రవర్మ మొదలైన రాజులు కూడా కోరుతున్నారా, నానాశనం! సరే సరే.

(ఎ. ఎ. నించి రాక్షసుడు వస్తాడు)

రా—కుమారా! జయం కలగాలి,

మ——ఆర్యా! నమస్కారం! రండి. దయ చెయ్యండి.

రా——(కూర్చుంటాడు)

మ——అమాత్యా! తమర్ని చాలా తొందరపని గురించి కలుసుగోవాలని అనుకున్నాను.

రా——నేను ప్రయాణపు తొందరలో నిన్ను కలుసుగో లేకపోయాను, కుమారా!

మ——దండయాత్ర గురించిన ఏర్పాట్లు ఏమేమి చేశారూ?

రా——ఏర్పాట్లు పూర్తి అయినాయి. మన సామంత రాజు లందరికీ యథోచితంగా స్థానాలు నిర్ణయించాము. చిత్రవర్మ మొదలైన రాజులంతా నీచుట్టూ విడవకుండా ఉండేటట్టు ఏర్పాట్లు జరిగిపోయాయి.

మ——(తనలో) ఔరా! నన్ను చంపగోరే వాళ్లా నాచుట్టూ విడవకుండా ఉండేటట్టు నువ్వు ఏర్పాట్లుచెయ్యడం! (పైకి) కుసుమపురంలోకి ఎవడేనా వెళ్ళడంగాని, కుసుమ పురాన్నించి ఎవడేనా రావడం గాని ఉందా?

రా——ఏమీ లేదు. త్వరలో మనమే అక్కడికి వెళ్లాలి.

మ——(తనలో) అల్లాగా! (పైకి) ఈ ఉత్తరం వీడి ద్వారా చంద్రగుప్తుడికి ఏ ఉద్దేశంతో పంపించారూ?

రా——(దానికేసి చూసి) సిద్ధార్థకా! ఏమిటిదీ?

సి—(వలవలా ఏడుస్తూ) అమాత్యా ! క్షమించండి. వీళ్ళు నన్ను చావగొట్టేసరికి రహస్యం దాచలేకపోయాను.

రా—(బొమముడితో) రహస్యం కుడా ఏమిటి, సిద్ధార్థకా !

సి—చిత్తం. వీళ్ళు నన్ను చాలా హింసపెట్టగా... (అని గజగజా వణుకుతాడు.)

మ—భాగురాయణా ! అతడు చాలా భయపడి పోతున్నాడు, నువ్వు చెప్పు, ఉన్నసంగతి.

భాగు—అమాత్యవరా ! తమరు ఒక ఉత్తరం ఇతడి చేతికిచ్చి ఇతణ్ణి చంద్రగుప్తుడి దగ్గిరికి పంపుతున్నారట.

రా—అట్లా అని వీళ్ళతో అన్నావా, సిద్ధార్థకా ?

సి—(తలవంచుగుని) నన్ను అదే కొట్టడం కొట్టగా, అన్నాను.

రా—కుమారా ! ఎవణ్ణేనా పచ్చడికింద చితగ పొడిస్తే ఏమనమంటే అది అంటాడు. అది అబద్ధం.

మ—అబద్ధం ఎట్లా అవుతుందీ ? భాగురాయణా ! ఆ ఉత్తరం చూపించు.

భాగు—మంత్రివరా ! ఇదుగో ఉత్తరం (అని ఉత్తరం ఇస్తాడు)

రా—(ఉత్తరం చూసి చదువుకుని) కుమారా ! ఇది శత్రువుల పన్నాగం.

మ—(హారంచూపించి) ఈ హారం మీరు చంద్రగుప్తుడికి పారితోషికం పంపించారట!

రా—(నగ చూసి) ఇదా! ఈ హారంనాకు నువ్విచ్చిందే. ఒక సంతోషసమయంలో ఇది ఈ సిద్ధార్థకుడికి కానుకగా నేనే ఇచ్చాను.

భాగు—ఇంత విలవ గలిగింది, రాజకుమారుడు తన ఒంటిమీద ఉన్నది తీసి తమకి పంపింది మీరు ఇంకోళ్ళకి ఇచ్చేశారంటే, ఎట్లా నమ్మకం?

మ—ఈ రాయబారి ద్వారా మీరు కొంత నోటి సందేశం కూడా పంపించారట!

రా—ఇదోటా? నాకు ఉత్తరమూ తెలియదు, నోటిసందేశం అసలే తెలియదు.

మ—అట్లాయితే, మరి ఈ ముద్ర ఎవరిది?

రా—కుమారా, నాదే! కాని శత్రువులు అభూతకల్పనలు చేస్తూంటారు.

భాగు—(సిద్ధార్థకుడితో) ఈ ఉత్తరం రాసిందెవరూ?

సి—(రాక్షసుడి మొహం చూసి ఊరుకుంటాడు)

భాగు—ఏం? నీకింకా ఏమన్నా కావాలా, చెప్తావా?

సి—(కంగారుపడి దణ్ణంపెట్టి) అయ్యా! ఈ ఉత్తరం—రాసింది—శకటదాసు.

రా—ఈ ఉత్తరం రాసింది శకటదాసే అయితే నేను రాసినట్టే.

మ—భాసురకా! వెళ్ళి శకటదాసుని తీసుకురా.

భాగు—కుమారా! ఆగు! ఈయన ఎదట ఇంత మందిలో ఆ సంగతి శకటదాసు ఒప్పేసుకోగలడా? ఒకపని చేద్దాం. ఒక పత్రం పంపించి, శకటదాసు చేతివ్రాత మాదిరి తెప్పిద్దాం.

మ—అవును, పోనీ, అల్లా చేద్దాం.

భాగు—భాసురకా! ఒక పత్రంమీద శకటదాసు చేత ఏదైనా కొంత రాయించి తీసుకురా.

భాసు—చిత్తం (అని ఎ. ఎ. కి నిష్క్రమిస్తాడు)

రా—(తనలో) ఔరా! అయ్యో! చాణక్యా! ఎంత పన్నాగం పన్నేశావయ్యా! నీ తంత్రప్రజ్ఞ మెచ్చి తీరతాను కాని, నా దురవస్థ తట్టుగో లేకుండా ఉన్నాను. ఈ సిద్ధార్థకుడు శత్రుపక్షంవాడని ఇప్పుడు పోల్చుకోగలుగు తున్నాను. కొంపతవ్వి శకటదాసు కూడా చాణక్య దూత కాడు గదా! అతడు నావాడే అనుకుని అతణ్ణి నమ్మేసి నా ముద్ర కూడా అతడిచేతి కిచ్చేశాను.

భాసు—(ఎ. ఎ. నించి వచ్చి, తలవంచి ఒక పత్రం భాగురాయణుడికి ఇస్తాడు.)

భాగు—మంత్రివరా! చూడండి. అక్షరాల పోలిక మీకు ఏమన్నా స్ఫురిస్తుందేమో!

రా—(ఉత్తరమూ పత్రమూ సరసని పెట్టిచూసి) అయ్యో! దైవమా! ఆ రాత శకటదాసు దే!

మ—దీనికి ఏమంటారూ?

రా—ఏమనను? రాతశకట దాసుదే అన్నాను.

మ—నగలు మూడూ అందినాయి అని రాశారే, మీరు ఇప్పుడు పెట్టుగున్న ఈ నగ ఆ మూడింటిలోదా? భాసురకా, ఈ నగ నువ్వు పోల్చుకో గలవా?

భాసు—(దుఃఖంతో) కుమారా! పోల్చలేకేమి? తమ నాన్నగారిది.

రా—కుమారా! ఈనగ శకటదాసు ద్వారా నేను కొన్న మూడింటిలో ఒకటి. కొనడానికి అంగీకరించేటప్పుడు కొంటున్నాది చాణక్య చారులై ఉన్న వర్తకుల దగ్గర—అని, గ్రహించుకోలేకపోయాను. నేను ఏ నగా ధరించకుండా ఉండకూడదని కోరుతూ నాకు హారం పంపించిన వాడవు నువ్వు. అటువంటి నీ దగ్గిరికి వచ్చేటప్పుడు నేను ఏ నగా లేకుండా రావడం ధర్మంకాదని ఆలోచించి, కొన్న మూడు నగల్లో ఒకటి పెట్టుగుని వచ్చాను.

మ—ఏమిటో! మాతండ్రి నగలేమిటి, అవి తరవాత చంద్రగుప్తుడికి చెందడం ఏమిటి, వర్తకు లేమిటి, మీకు అమ్మచూపడం ఏమిటి. మీరు కొనిపించడం ఏమిటి మంత్రివర్యా!

రా—ఏం చెప్పను కుమారా! అవన్నీ సంభవించాయి. కాని అవి వాటంతట అవే జరిగినవి కావు, జరిగింప

బడినవి అని నీకు తెలియదు. శత్రువుల పన్నాగం అంత కట్టుదిట్టంగా అంత సమగ్రంగా అంత బ్రహ్మాభేద్యంగా ఉంది.

మ—సరేగాని, ఒక్క సంగతి చెప్పండి.

రా—నన్నా అడుగుతావు, ఎవణ్ణైనా ఆర్యుడైన వాణ్ణి అడుగు, చెబుతాడు. నేనిప్పుడు అనార్యుణ్ణే.

మ—(ఉత్తరమూ పెట్టే చూపిస్తూ) ఇవి ఏమిటి ?

రా—ఇవన్నీ కూడా దైవంయొక్క విలసితాలు.

మ—ఛీ ! ఎందుకయ్యా ఇంకా దాచి కప్పెట్టు కుంటావు ? విషకన్యని లేవదీసి నాతండ్రిని చంపినవాడవు నువ్వేగా ?

రా—అయ్యో ! అయ్యో ! పాపం శాంతించాలి. ఇంత మహాదారుణమా ! నామీద పిడుగే పడిందే ! పర్వతేశ్వరుడిమీద నేనా విషకన్యని ప్రయోగించింది ?

మ—నువ్వు కాకపోతే మరెవరూ ?

రా—ఏమో. నాకేం తెలుసూ ? నన్నడుగుతావేం ? దైవాన్ని అడుగు.

మ—దైవాన్ని అడగాలా ! అల్లానా ? పోనీ, జీవసిద్ధిని పిల్చి అడుగుదామా ?

రా—బాబో ! జీవసిద్ధికూడా చాణక్య పక్షంవాడేనా! శ్రీహరీ ! శత్రువులు నా గుండెల్లో ప్రవేశించారే !

మ—సరి. సరి. నీ వాపోవడం మరి కట్టిపెట్టు. ఒరీ, భాసురకా ! శేఖరసేనుడితో ఇట్లా చెప్పు:—నాకు ద్రోహం జరపాలనే ఉద్దేశంతో రాక్షసుడితో జట్టుకట్టి ఉన్న చిత్రవర్మ సింహనాద పుష్కరాక్షులు నారాష్ట్రం కోరుతున్నా

రట. వాళ్ళని నారాష్ట్రంలో మిక్కిలి లోతైన గోతుల్లో పాతిపెట్టవలిసిందని చెప్పు. తక్కిన సింధుసేన మేఘుకోశులు నా ఏనుగుబలం కోరుతున్నారట, వాళ్ళకి నా ఏనుగుబలం తెలిసేటట్టు వాళ్ళని తొక్కించవలిసిందనికూడా చెప్పు.

భాసు—చిత్తం (అని ఎ. ఎ. కి నిష్క్రమిస్తాడు)

మ—రాక్షసామాత్యా! నువ్వింక శీఘ్రంగా లేచిపో. లేచిపోయి, చక్కగా మీ చంద్రగుప్తుడితో కలిసిపో.

భాగు—కుమారా! రా! మనంవెళ్ళి కుసుమపురం దండయాత్ర ప్రారంభం చెయించుదాం.

మ—రా! (అని కు. ఎ. కి వెడతారు)

రా—(ఎ. ఎ. కి వచ్చి) అయ్యో! ఎంతకష్టం, ఎంతకష్టం! ఎంతో స్నేహితులు—చిత్రవర్మ సింహనాద పుష్కరాక్ష సింధుసేన మేఘుకోశులు నాశనం అయిపోతు న్నారు. శత్రునాశనంకోసం నేను ఎత్తులువేస్తే మిత్రరాజుల నాశనం సిద్ధించింది. ఇక, నాకర్తవ్యం ఏమిటి? తపస్సు చేద్దాం అంటే, అంతర్వైరం అణగడాయిరి. సేవచేద్దాం అంటే, శత్రువులు అట్లానే ఉంటూండగా, ఆడంగితనం కూడానూ! ధైర్యావలంబనం చేద్దామంటే, దైవం ప్రతికూలం. చాణక్య తంత్రం ఛేదించుదాం అనుకుంటే, నాశక్తికి అతీతం. మరేముంది? ఖడ్గధారణం, శత్రుభంజనం, మృత్యు స్వీకరణం! వెంటనేకాదు! చందనదాసు ఉన్నాడుగా! అతణ్ణి చూడకపోవడం కృతఘ్నత! చందనదాసు అమృ తుడు! ఆ అమృతుణ్ణి చూసి నేను మృతుణ్ణి అవుతాను.

(అని ఎ. ఎ. కి వెడతాడు)

---

## రంగం-6

[పాటలీపుత్రం పరిసరాలు. కు. ఎ. నించి సిద్ధార్థకుడూ ఎ. ఎ. నించి క్షపణకుడూ వచ్చి కలుస్తారు రెండవ తెరఎదుట]

సి—(కు. ఎ. నించి వస్తూ) ఇదుగో! జీవసిద్ధిగారు!

క్ష—(ఎ. ఎ. నించి వస్తూ) ఇదుగో! సిద్ధార్థకుడూ!

సి—గురుదేవుల దగ్గిరికేనా?

క్ష—అవును. రమ్మన్నారు. మలయకేతు ఏమయాడు?

సి—చాణక్య నీతిలోపడి మతి చెడ్డాడు. రాక్షసుణ్ణి శంకించి లేవ గొట్టేశాడు. చిత్రవర్మ మొదలైన ఐదుగురు రాజుల్ని మట్టంచేశాడు. దాంతో హడిలిపోయి తక్కిన సామంతులు తోక ముడిచేసి మలయకేతు నగరాన్నించి పారిపోయారు.

క్ష—భద్రం భటుడూ వాళ్ళూ ఇంటికి వచ్చేశారా?

సి—వచ్చే ఉంటారు, చాణక్య తంత్ర ప్రజ్ఞకి నమస్కారం.

క్ష—రాక్షసుడిగతి ఏమైంది?

సి—చాణక్యులవారికి ఇప్పుడే వార్త వచ్చింది. చందన దాసంటే అతనికున్న స్నేహంవల్ల ఈ పాటలీపుత్ర ప్రాంతాలకే వచ్చేశాడని.

క్ష—ఇంకా ఎక్కడ చందనదాసు లేస్తా! అతడికి ఒకటే మోక్షం!

సి—ఇప్పుడే చందనదాసుని వధ్యస్థానానికి తీసిగెళ్ళవలిసిందని ఆచార్య చాణక్యుల ఆజ్ఞ! చండాలవేషంలో ఉండమన్నారు నన్ను.

క్ష—చాణక్య గురువు నాకు కబురుచేసింది, ఆ రోండ్లో చండాలవేషంలో నన్ను ఉండమనేమో! ఇట్లానే పోయి చండాల వేషాలు ధరించి, ఈపని పూర్తిచేద్దాం, రా.

(కు. ఎ. నించి నిపుణకుడు వస్తాడు.)

క్ష—(నిపుణకుణ్ణి చూచి) ఇడుగో నిపుణకుడూ!

ని—పనిమీద వెడుతున్నారా?

క్ష—అవును

ని—మీరు సిద్ధార్థకుణ్ణి కలుసుగుని అతడికి తోడ్పడాలని గురుదేవుల ఆజ్ఞ.

క్ష—ఇదుగో కలిశాను. తోడ్పడతాను. గురుదేవుడి ఆజ్ఞలో మహాత్మ్యం ఏమిటంటే, అది ఇయ్యక పూర్వమే నెరవేరుతూంటుంది. నువ్వు?

ని—నేనూ పనిమీదే ఉన్నాను.

సి—స్వంతపనా?

ని—అబ్బే, ఆర్య చాణక్యులు నిర్ణయించిన పనే.

సి—అయితే మరి పోదాం.

ని—జయం, జయం, పోదాం.

(నిపుణకుడు ఎ. ఎ, కి నిష్క్రమించగా, సిద్ధార్థక
క్షపణకులు కు. ఎ. కి నడవగా రెండో తెర
లేస్తుంది. అడివి కనబడుతుంది)

[ ఎ. మ. నించి నిపుణకుడు ప్రవేశిస్తాడు ]

ని—మలయకేతువు రాక్షసుడికి ఉద్వాసన చెప్పే శాడట. మలయకేతు నగరంనించి రాక్షసుడు, ఈ పాటలీ పుత్ర ప్రాంతానికే చేరుకుని ఉన్నాడని ఆర్య చాణక్యుల వారికి తెలిసింది. ఈ సంగతి నిర్ధారణగా తేల్చుకురమ్మని చాణక్యులు నన్ను నియోగించారు. నేను లోగడ రాక్షస మంత్రిని చూడలేదు, ఎరగను అందుకని పోల్చలేను. ఏదో వేషంవేసి ఇది తేల్చాలి. (కు. ఎ. కి చూస్తూ) తల ముసుగెట్టు కుని ఎవరో ఇటు వస్తున్నారు. నేను (కు. మ. చూపెట్టి) ఈ పక్కని దాక్కుని, సకాలంలో ఒక ప్రయోగం ఆచ రిస్తాను. (అని కు. మ. కి వెడతాడు)

రా—(కు. ఎ. నించి, ఖడ్గంధరించి, ముసు గులో వస్తూ) ఔరా! ఎంత కష్టం! రాజ్యకాంత కులట, దానికి వైధవ్యం వచ్చినవెంటనే మరొకణ్ణి చేపట్టింది. గతానుగతికంగా జనం దాన్ని వెంబడించారు. ఆప్తులు కూడా ఫలసిద్ధి లేక విరమించుకున్నారు. ఈ ధోరణి చూడగా, తలలేని శరీరం ఎంతకాలం ఉంటుంది! అని స్ఫురిస్తోంది. మహాకులుడైన నందుణ్ణి విడిచిపెట్టి రాజ్య కాంత నిశ్చయంగా వృషలి అయిపోయింది. అయిపోయి

వృషలుడు — అయిన చంద్రగుప్తుణ్ణి చెట్టబట్టింది. నేను మొదట నందుడిదగ్గిరా, ఆయన ఆకస్మికంగా గతించగా పర్వతేశ్వరుడి దగ్గిరా, ఆయన పోగా అతడి పుత్రుడిదగ్గిరా ఎంతో యత్నంచేస్తూ వచ్చినా, దైవం నాకు చుక్క ఎదురుగానే ఉంది. నంద శత్రువు దైవమేకాని, చాణక్యుడు కాడు. కాని, అయ్యో, ఆ మలయకేతువు ఎంత బుద్ధి లేకుండా పోయాడూ? నాకు స్పృహ ఉండగా నేను శత్రువుతో కలిసిపోతానా! ఆమాత్రం ఆ మలయకేతువు బుద్ధికి తోచలేదే? నా చర్యలన్నీ విపరీతంగా అర్థంచేసుకున్నాడు, మలయకేతు. కాలం తోసుకొస్తూంటే మనిషి అట్లానే చేస్తూంటాడు. మలయకేతు క్షణంలో శత్రువులకి చిక్కి నశించిపోతాడు. నేనా! విజయం శత్రువుకి దక్కినాసరే, నేను నాభక్తి వదలను, సంధిచేసుకోను. (గద్గదస్వరంతో) ఇవిగో! ఉపవనస్థలాలు! పూర్వం నందమహారాజు ఇక్కడ బాణం వేసేవాడు, ఇక్కడ విశ్రాంతి తీసుకునేవాడు, ఇక్కడ మాట్లాడేవాడు. ఈ స్థలాలకేసి ఇప్పుడు చూస్తూంటే, కడుపు చెరువైపోతోంది. నేను ఏమి చెయ్యగల్ను! అభాగ్యుణ్ణి. ఎక్కడికి వెళ్ళను? ఇదే జీర్ణోద్యానం! ఇటు వెళ్ళి మా చందనదాసు వృత్తాంతం ఏమన్నా తెలుస్తుందేమో కనుక్కుంటాను. పాపం నామూలాన్ని అతడికి ఏంమూడుతుందో! పూర్వం ఇదే స్థలంలో అనేక రాజులు చుట్టుముట్టి రాగా నేనూ రాజులాగ మెల్లిగా అడుగులు

నేస్తా నడిచేవాణ్ణి, ఇప్పుడు ఒంటరిగా దొంగాడులాగ కంగాడుగా కాళ్ళిలవక తచ్చాడుతున్నాను. అంతటి వాణ్ణిగా నన్ను చేసిన ఆ ప్రభువు ఇప్పుడు లేడుకదా! (ప. మ. కేసి నడిచి చూడ్డం నటించి) అయ్యో! ఈ జీర్ణో ద్యానం ఇప్పు డెంత అరమణీయంగా ఉంది! కాలక్రమాన్ని పుట్టుగొచ్చిన మహావంశమూ అన్నట్టుండే సౌధం నేల బడి పోయింది. మిత్రులు నశించినవాడి హృదయంలాగ సరస్సు ఎండిపోయింది. విధి ప్రతికూలించినవాడి పన్నాగాలు మాదిరిగా వృక్షాలు నిష్ఫలాలు అయిపోయినాయి. దుష్టుల బోధలకి లొంగిపోయే మూఢుడి బుద్ధిమోస్తరుగా భూమి తృణావృతమై ఉంది. ఈ చెట్ల దురవస్థ చెప్పడానికే అలవి కాదు. ఈ కొమ్మలు గొడ్డలివేట్లు తిని తిని పక్షిరొదల నెపంగా ఏడుస్తూంటే, సహవాసులైన పాములు జాలితల్చి చికిత్స మొదలెట్టి గాయాలచుట్టూ తమ కుబుసాలనే గుడ్డ పీలికలు చుట్టబెట్టి నిట్టూర్పులు విడుస్తూ ఉన్నాయి. అదీ కాక, ఈచెట్లు తమ అంతర్యంలో ఉన్న చింతాగ్నికి శుష్కించిపోయినట్టు ఉండి ఛాయ ఏమాత్రమూ ఇయ్య కుండా కేవలం శ్మశానానికి బయల్దేరిన రకంలా ఉన్నాయి.

నేను ఈ పగిలిన రాతిమీద కొంచెం విశ్రమిస్తాను. నాస్థితిలో ఉన్నవాడికి ఇల్లాంటిదే, చాలా అర్హం. (ధ్వని వింటూన్నట్టు నటించి) ఎందుకో ఈ భేరీధ్వని! ఎందుకో

ఈ శంఖారావం! చెవులు బద్దలయేటట్టు ఆకాశంయొక్క విస్తీర్ణం కొలవడానికా అన్నట్టు వ్యాపిస్తోంది. (ఊహించడం నటించి) అదా! చంద్రగుప్త పక్షంవాళ్ళు మలయకేతువుని పట్టుగున్నందుకు తమ ఆనందం ప్రకటిస్తున్నారు గావును! అయ్యో! నాఅవస్థ! శత్రువుయొక్క అద్వితీయశక్తి నేను వినడం జరిగింది, ఇప్పుడు విధివశంచేత ఆశక్తి నేను రుచి చూస్తాను గావును! (అని ఎ. ఎ. దగ్గిర ఎడమకి తిరిగి తల పట్టుగుని కూచుంటాడు. నిపుణకుడు కు. ఎ. కి వచ్చి, కుడికి తిరిగి రాక్షసుణ్ణి చూడకుండా కూచుని, తాడుతో ఉరి సిద్ధం చేసుగుంటూ ఉంటాడు.)

రా—(కుడివైపు చూసి తనలో) అయ్యో! పాపం, ఇతడెవడో ఆత్మహత్య చేసుగుంటున్నాడు.

(పైకి) అదేమిపని, నాయనా! ఏమొచ్చింది!

ని—(వినిపించుగోకుండా ఉరి బిగించుగోడానికి యత్నిస్తాడు.)

రా—ఒక్కమాటు ఆగి, నువ్వెవరో చెప్పు, నాయనా.

ని—నేను ఒక నిర్భాగ్యుణ్ణండి.

రా—ఎందుకూ అపనీ!

ని—ఎందుకో! నాప్రియమిత్రుడొకడు చావడానికి సిద్ధంగా ఉన్నాడూ! అందుకని.

రా—అయ్యో! ఎంతకష్టం! రహస్యం కాకుండా ఉంటే నీసంగతి కొంచెం చెప్పు బాబూ!

ని—ఎందుకు నన్ను నిర్బంధపెడతారు గనకా, నన్ను చావనీండి నామాటవిని.

రా—అబ్బెబ్బే, అదేంమాట నాయనా! నీకుభారం కాకపోతే, కారణం చెప్పుమరీ.

ని—ఎందుకండీ నన్నిల్లా బాధించడం?

రా—బాధ తగ్గించడానికి వీలుందేమో చూడడానికే.

ని—బాధపెట్టి తద్వారా బాధ తగ్గించాలని బాధ పడుతున్నారు. గనక, వినండి. ఈ ఊళ్లో విష్ణుదాసు అనే వర్తకుడున్నాడు.

రా—(తనలో) ఓహో! అతడు చందనదాసు మిత్రుడే. (పైకి) ఉంటే!

ని—అతడు నా ప్రియస్నేహితుడు.

రా—అల్లానా! అతడి కేమొచ్చిం దిప్పుడూ?

ని—అతడు అగ్నిగుండంలో దూకబోతున్నాడు. అతడి మరణవార్త నా చెవిని పడకుండా నేను ముందే చావ దల్చుకున్నాను.

రా—నీమిత్రుడు అగ్నిలో దూకడం ఎందుకో! పాపం ఏమన్నా జబ్బా?

ని—కాదండి.

రా—రాజుగారికి ఆగ్రహం వచ్చిందా?

ని—ఈ దేశంలో అల్లాంటివి ఎరగం.

రా—మోహం వ్యాపారంలో దేన్లోనేనా భంగపడ్డాడా?

ని—అతను తుంటరిరకం కాదండి.

రా—అతడికి ఏదేనా మానసిక వ్యాధి ఉందా?

ని—మరేనండి. తనికి ఓ మిత్రుడుంటే వాడిబాధ తన మనస్సుకి అతిగించుకున్నాడు.

రా—అయ్యో! మీ మిత్రమిత్రుడు ఎవరు? అతడికొచ్చినబాధ ఏమిటి? దయచేసి చెప్పండి.

ని—అయ్యో! అదంతా జోలెదుకాండ. కాలయాపనం అయిపోతోంది. నన్ను చితిగిలో చావనిస్తురూ, వదిలిపోతుంది పీడ!

రా—మీ మిత్రమిత్రుని సంగతి నేనూ వినతగ్గదేనండీ! దయచేసి వినిపించండి.

ని—అబ్బా! అయితే నాకు గత్యంతరం లేదన్నమాట! వినండి.

రా—చెప్పండి, త్వరగా.

ని—ఈ పురంలో చందనదాసు—అనే మణివర్తకుడు ఉన్నాడు. మీరెప్పుడేనా ఆపేరు విన్నారా?

రా—ఆ. విన్నాను. అతడు మిత్రప్రియుడు.

ని—అతడు మా విష్ణుదాసుకి ప్రియమిత్రుడు.

రా—(తనలో) అయ్యో! ఈ చెవలతో ఏ పిడుగులాంటిమాట వినాలోకదా!

ని—మా విష్ణుదాసు మిత్రప్రేమ చూపిన చంద్రగుప్తుడికి ఒక విన్నపం చేసుకున్నాడు.

రా—ఏమనీ?

ని—నా సొమ్మంతా నీకు ధారపోస్తాను మహారాజా, చందనదాసుని విడిపించండి—అని.

రా—ఆహా ఆహా! ఆ విష్ణుదాసుడిది ఏమి ఔదార్యం, ఏమి ఔదార్యం! ఊఁ, ఏమన్నాడు చంద్రగుప్తుడు?

ని—ఏమన్నాడంటే ఓ విష్ణుదాసూ! చందనదాసుని నేను బంధించింది ఎల్లాగైనా ధనం లాగాలని కాదు. తన యింట్లో రాక్షసుడి భార్యాపుత్రుల్ని అతడు దాచాడట. ఆమాట ఒప్పుగోవడం లేదతడూ. ఇప్పుడైనా సరే అతడు వాళ్ళని దాచినచోటు చెప్పి మాకు అప్పగించేస్తే, అతణ్ణి వదుల్తాం. లేకపోతే అతనికి మరణశిక్ష తప్పదు—అన్నాడు. చందనదాసుని వధ్యస్థానానికి తీసుగుపోవలిసిందిగా ఆజ్ఞ ఇచ్చేశారు, తీసుగుపోయారు. చందనదాసుయొక్క మరణవార్త తన చెవిని పడేలోపల విష్ణుదాసు అగ్నిలో దూకడానికి సిద్ధంగా ఉన్నాడు. విష్ణుదాసుయొక్క మరణవార్త నా చెవిని పడేలోపల నేను ఉరి పోసుగోవాలని, ఈ ఉపవనంలోకి వచ్చాను.

రా—చందనదాసుని ఈ పాటికి చంపేసి ఉంటారా?

ని—చంపేసి ఉండరుగాని, ఇక కాస్సేపట్లో చంపి తీరతారు. ఎంచేత నంటారా, రాక్షసుడి భార్యాపుత్రుల్ని గురించి అడిగితే, అతడేమీ ఒప్పుగోడు, వాళ్ళని తను దాచిన చోటు చెప్పడు. వాళ్ళని, అప్పగిస్తాను అనడు...

స్వామీ! నేనింక చచ్చిపోవాలి, మీరు కొంచెం ఎడంగా వెళ్ళండి.

రా—(తనలో) చందనదాసూ! నీమైత్రి ఎంత పవిత్రమో గదా! ఎంత ధన్యమోగదా!

(పైకి) అయ్యా! తమరు చావద్దు. ఉరెట్టుకోవద్దు. తక్షణం వెళ్ళి మీ విష్ణుదాసు అగ్నిలో దూకకుండా చూసుకోండి. నేను పరిగెట్టి హంతకులు చందనదాసుని వధించకుండా చేస్తాను.

ని—చందనదాసుని హంతకులు వధించకుండా చెయ్యడం మీవల్ల ఏమవుతుందీ?

రా—(ఒరలోంచి కత్తిలాగి) ఈ ఖడ్గం ఉందిగా!

ని—అయ్యా! చందనదాసు రక్షణగురించి ఇంత ఉద్రేకం చూపిస్తున్నారు తమరూ! ఎవరై ఉంటారు స్వామీ తమరూ! నేను పోల్చుకోలేకుండా ఉన్నానే! సుప్రసిద్ధులైన రాక్షసామాత్యులు కారుగదా మీరు! (అని రాక్షసుడి పాదాలకి మొక్కుతాడు.)

రా—లేవండి. లేనండి. లేచివెళ్ళి 'రాక్షస మంత్రి చందనదాసు మరణం తప్పించేస్తానని అన్నాడు. నువ్వు మరణించకు' అని మీ విష్ణుదాసుతో చెప్పండి.

ని—అల్లానే చెబుతానుగాని, స్వామీ, తమ రెవరో నాకు స్పష్టంగా చెప్పేశారు కారు!

రా—చెప్పకేం? ఏ రాజుని నమ్ముకుంటే ఆ రాజే దూరం కాగా, దైవం ప్రతికూలించగా, ఆపదలు చుట్టెయ్యగా మిత్రనాశనానికి కారణభూతుణ్ణైన రాక్షసమంత్రిని, నేనే.

ని—అమాత్యా! నమస్కారం. నేను వెళ్ళివస్తాను. మీరు ఖడ్గధారులై వెళ్ళవద్దు. ఏమంటే! చంపడానికని శకటదాసుని వధ్యస్థానానికి తీసికెళ్ళిన హంతకులు, శకట దాసు పారిపోవడానికి ఒప్పుగున్నారని తెలిసి, చాణక్యుడు ఆ హంతకుల్ని హతమార్చేశాడు. అప్పట్నించీ, ఖడ్గంధరించి కనిపించిన ప్రతీవాణ్ణీ ఆలోచనలేకుండా తుంచి పారేస్తున్నారు. కాబట్టి, మీరు ఖడ్గం ప్రకటిస్తూ వెళ్ళడం జరిగితే చందనదాసు మరణం వేగిర పరిచినట్టు అవుతుందేమో, యోచించండి. (అని కు. ఎ. కి గబగబా వెడతాడు)

రా—ఔర చాణక్యం! శకటదాసుని నాదగ్గిరికి తీసుగొచ్చిన సిద్ధార్థకుడు చాణక్య చారుడే అనుకుందాం అంటే, మరి చాణక్యుడు ఆ హంతకుల్ని చంపి ఉండడం ఎట్లా! లేకపోనీ సిద్ధార్థకుడు చాణక్యపక్షం కాడు అనుకుందాం అంటే, వాడికి ఆ ఉత్తరం ఎట్లా లభించిందీ? ఏమో, తర్కించగా తర్కించగా, ఏదీ నిశ్చయించడానికి వీల్లేకుండా పోతోంది...సరే. ఏమైనా, ఖడ్గానికి ఇది కాలం కాదు. రాజకీయంలో పన్నాగాలు పనపడిగాని ఫలోన్ముఖానికి రావు. ఉపేక్ష ఏరంగంలోనూ న్యాయం కాదు. నాకోసం అని, ఒక గాఢస్నేహితుడు మృత్యుముఖాన్ని ఉన్నాడు. నాశరీరం ఇచ్చేసి అతణ్ణి విడిపించడం నాకు విధాయక కృత్యం (కత్తిగిరవేసి ఎ. ఎ. కి చరచరా వెళ్ళిపోతాడు).

## రంగం-7

[రెండో తెర ఎదట. వజ్రలోముడు వేషంలో సిద్ధార్థకుడు
కు. ఎ. నించి ముందు రాగా, వెనకాల చేతులు
కట్టబడి చందనదాసు వస్తాడు]

సి—అంతా యినండి. మీ వ్యాణా సేమం నిమిత్తం
మీ వైన సేమం నిమిత్తం మీ భార్యా సేమంనిమిత్తం,
మీ బిడ్డల సేమం నిమిత్తం, రాసకీయ యిసాన్నించి దూరంగా
తప్పుగోండి. వొట్టి యిసం అయితే తినోళ్లనే సంపుకున్న
సంపేస్తది. రాసకీయ యిసంగం టే, తినోళ్లనే. ఆడి కుటుం
బాన్ని అంతనీ తుడిచేస్తది. కావాలంటే, ఇట్టా సూస్తోండి,
ఈ సందందాసు. ఈనగోరు రాచ్చస మంత్రిగారి భార్యనీ
కొడుకునీ యింటో దాసుగుని ఒప్పగోనందుకు మరనసిచ్చ
అనుబవిత్తూండాడు.

(చందనదాసు చేతులికి కట్టిఉన్న తాడుతో తన వెనకాల
చందనదాసుని నడిపించుగుంటూ ఎ. ఎ. కి సిద్ధార్థకుడు
వెళ్ళగా, రెండో తెర లేస్తుంది. వధ్యస్థానం కని
పిస్తుంది. ఎ. వె. నించి, బిల్వవక్తృడు వేషంలో
క్షపణకుడు రాగా, ఎ. మ. నించి సిద్ధార్థకుడూ
చందన దాసూ వస్తారు)

సి—ఓలన్నా! సూలం నాటొచ్చావురా?

క్ష—(ఎ. వె. చూపిస్తూ) అదుగో, లక్కుడ!
గట్టిగా ఉంది.

సి—(చందన దాసుతో) ఏయ్ ! నువ్ సిద్ధంగా ఉండావా ?

చం—ఓ

సి—బాధగాని పడిలోపల ఏమంత్తూండావా ?

చం—బాధ ఏమీ లేదు. చాలా సంతోషపడు తున్నాను.

సి—సంతోసపడు తూండావా ! (ప్రసన్నాసడితో) ఏట్రా, లన్నా, ఈ ఊసూ ?

చం—నా స్నేహితుడికోసం నా ప్రాణం ఇచ్చేస్తు న్నాను గదా అని నా సంతోషం.

సి—ఓలదా ! నీఓళ్ళు ఓళ్ళా రాలేదే ?

చం—ఎక్కడున్నారో !

సి—ఒస్ ! అదేగా నువ్ సెప్పంది ! అందుకేగా నీసావూ ! వాత్తే తెలిసిపోదా ?

చం—ఆ భయం ఎప్పుడూ లేదు.

సి—పోనీ, నీవోళ్ళకి ఏమైనా సెబతావా ?

చం—ఏముటుంది చెప్పడానికి ! మీకు వాళ్ళెప్పు డేనా కనిపిస్తే చాణక్యుడు అడుగు పెట్టని దేశం చూసుగుని అక్కడ కాపరం చెయ్యవలసిందని వాళ్ళని నేను కోరాను అని చెప్పండి.

సి—ఒరి యెర్రోడా ? సాణక్కులోరి పెబాపంలేని దేశం యెట్టా ఉంటదయ్యా ! సరి. నడునడు.

(అని ఎ. వె. కి చందనదాసుని తీసికెళ్ళబోతాడు)

రా—(కు. ఎ. నించి గబగబా వస్తూ) ఒరీ హంతకులూ, హంతకులూ ! చంపకండి, చందనదాసుని చంపకండి.

చం—(ఆనంద బాష్పాలతో) అయ్యో ! అమాత్య రాక్షసుడే !

రా—(సిద్ధార్థకుడితో) ఒరీ ! నువ్వెళ్ళి మీ అధికార్లు ఎవరో వాళ్ళతో ఇల్లా చెప్పు. కలికాలంలోకల్లా ఉత్తముడూ శిబిని మరిపించే ఉదారుడూ అయిన చందనదాసు ఎవరిమీద అత్యంత ప్రేమచేత తన ప్రాణం ధారపొయ్యడానికి సిద్ధపడ్డాడో ఆ అధముడు, రాక్షసుడు అనే పేరువాడు స్వయంగా వచ్చి, దొరికిపోయాడు—అని.

సి—(క్షపణకుడితో) అన్నా ! ఈ మశానంసెట్టు నీణ్ణి ఈ సందందాసు న్నెట్టుగుని సూత్తూండ్రా, నేయెల్లి అతికార్లతో సెప్పొత్తాను (అని ఎ. ఎ. కి నిష్క్రమిస్తాడు)

రా—(తొందరతో వెళ్ళి చందనదాసుని కౌగిలించుకుని) మిత్రమా ! నువ్వు దేవదూతవుగాని, మానవ మాత్రుడవు కావు !

చం—(కన్నీళ్ళతో) అమాత్యా ! ఇట్లా చేశారేమిటి, చివరికి ?

రా—నువ్వు ఏం జేశావో నాకు తెలియడంతోటే, ఇంతకంటె మరొకలాగ నేను చెయ్యలేక పోయాను.

చం—అయ్యో! అమాత్యశేఖరా! ఏసాహసమో నేను చేశానే అనండి. మీరు పట్టుబడి పోతే, నాసాహస ప్రయాసలన్నీ వ్యర్థమే గదా!

రా—మిత్రమణీ! నాగురించి నువ్వుచేసిన త్యాగంతో నేను నీకు చాలా ఋణపడ్డాను. ఎన్నిజన్మల్లో అది నేను తీర్చుకో గల్నో తెలియదు. ఈ జన్మలో నేను చెయ్య గలిగింది చేశాను. మరేమీ అనుకోకు. (అని ఎ. ఎ. కి చూస్తూ) అదుగో ఒక చండాలుడి వెనకాల ముసుగులో ఎవడో వస్తున్నాడు. అతడే చాణక్యుడు గావును! దురా త్ముడు! కాడు కాడు, అతణ్ణి నేను అట్లా అనడం ఎందుకు? అతడు మహాత్ముడే! నామాత్సర్యం అతడి గొప్పతనాన్ని ఒప్పకపోతే, అది వేరేసంగతి. సముద్రుడు రత్నాకరుడైె నట్టు ఇతడు సర్వశాస్త్రాకరుడు.

[ఎ. ఎ. నించి ముందు వజ్రలోముడువచ్చి ఎ. వె. కి వెళ్ళగా, వెనకాల చాణక్యుడు వచ్చి, అగి రాక్షసుణ్ణి చూసి ]

చా—(ఎ. ఎ. నించి వచ్చి) ఇతడే రాక్షసుడు! మహాత్ముడు! ఈ సూక్ష్మబుద్ధి నకార్యసేన యావత్తునీ చీకాకుపరిచి, నాకు గట్టిపని చెప్పడమేకాకుండా, చాలా శ్రమకూడా కలిగించాడు. (ముసుగు తప్పించుకుని) ఆర్యా!

అమాత్య రాక్షసా! నమస్కారం! నమస్కరిస్తూన్నది చాణక్యుడు (అని అతడి దగ్గిరికి నడవబోతాడు)

రా—నమస్కారం, ఆచార్య చాణక్యా! ఆగు! నన్ను చండాలురు ముట్టుకున్నారు. అటువంటి నన్ను నీవంటి బ్రాహ్మణుడు తగల కూడదు.

చా—రాక్షసామాత్యా! వీళ్ళు చండాలురు కారు. ఇతడు సిద్ధార్థకుడు, ఇతడు క్షపణకుడు, వీళ్ళని నువ్వు ఎరుగుదువ్!

రా—(వాళ్ళని చూచి ఆశ్చర్యపడతాడు)

చా—ఆ ఉత్తరం ఉందే, అది, పాపం, శకటదాసు రాయలేదు. నేను కల్పించిందే.

రా—ఔరా! నేను అట్లానే ఊహించాను.

చా—ఇన్నేందుకూ, నగలూ పారితోషికమూ నీ ముద్రతో ఉత్తరమూ — సర్వమూ నా ప్రయోగాలే! ఇదంతా నేను చేసింది ఎందుకనుకున్నావు; అమాత్యా! నిన్ను ఎల్లానేనా ఒప్పించి చంద్రగుప్తుడి దగ్గిర మంత్రిగా ఉంచాలని! వీటి కన్నింటికీ ఏమొచ్చెలే! చంద్రగుప్తుడు నిన్ను చూస్తాడట, వస్తున్నాడు, (అని కు. ఎ. కి చూసి) అడుగో!

రా—(తనలో) అయ్యో! ఏ ఒక విషయం జరగ కూడదని నేను కోరుకుంటూ ఉంటానో, ఆ విషయం ఒకటే జరిగిపోతుందా ఏమిటి, దైవమా!

చంద్ర—(కు. ఎ నించి వస్తూ, చాణక్యుణ్ణిచూసి అతనికేసి నడిచి పాదాలమీద పడుతూ) గురుదేవా, నమస్కారం.

చా—(లేవదీస్తూ) లే చంద్రగుప్తా! నీపుణ్యాం ఫలించింది. ఈయనే అమాత్య రాక్షసుడు. నమస్కరించు; దీవిస్తారు.

రా—ఔరా—ఈ చాణక్యుడు అప్పుడే ఎట్లా కలిపేస్తున్నాడో సంబంధం.

చంద్ర—(రాక్షసుణ్ణిచూసి, అతడివైపు నడిచి, అతడి పాదాలమీద పడుతూ) అమాత్యా! చంద్రగుప్తుడు నమస్కరిస్తున్నాడు.

రా—(అతణ్ణి లేవదీస్తూ) రాజా! నీకు విజయం కలగాలి.

చంద్ర—(లేచి) తమదయ, తమకృప.

చా—రాక్షసామాత్యా! చందనదాసు బతికిఉండడం నీకు ఇష్టమేనా?

రా—అంతకంటె ఇష్టం నాకు మరేమి ఉంటుందీ? సందేహించవలిసిం దేముందీ?

చా—సందేహించ వలిసిం దేముందనా! విను. నువ్వు చంద్రగుప్తుణ్ణి అనుగ్రహించి అమాత్య ఖడ్గం ధరిస్తావో, లేక ధరించను పొమ్మంటావో అనేది సందేహం.

చందనదాసుని మృత్యుముఖంలోంచి ఇవతలికిలాగి అతడికి ప్రాణప్రతిష్ఠ చెయ్యదల్చుగున్న వాడవైతే (ఖడ్గంఇస్తూ) ఇదుగో అమాత్యపదవి స్వీకరించు.

రా—అమాత్య చాణక్యా! ఆకత్తి ధరించడానికి నేను తగను. అందులోనూ, అది నువ్వు ఇప్పటివరకూ ధరించిఉన్న ఖడ్గంగనక, అది ధరించడానికి నేను అసలు తగను.

చా—ఆర్యా! నేనే యోగ్యుణ్ణో, నువ్వే యోగ్యుడివో, ఆగొడవలన్నీ ఇప్పు డెందుకు గనకా! చంద్రగుప్తుడి దగ్గిర మంత్రిపదవి స్వీకరించు, చందనదాసు జీవిస్తాడు! ఈ పదవి తిరస్కరించు, చందనదాసు ఉండడు! ఏంచెబుతావో చెప్పు. ఒరీ వజ్రలోమా, బిల్వవక్త్రా! మీరు అటుగా వెళ్ళి సిద్ధంగా ఉండండి.

రా—(ఆలోచించి, నిదానించి, ముఖం చిట్లించుగుని, తల ఊగించి) ఆర్య చాణక్యా! సరే. అట్లాగే. నందరాజులమీది ప్రేమ కోసిపారేసుగుని, అమృతస్వరూపుడైన చందనదాసుకి నేను తీర్చుగోవలిసిన ఋణంయొక్క భారం గమనించి, గత్యంతరం కనిపించక, చంద్రగుప్తుడి దగ్గిర మంత్రిపదవి స్వీకరించడానికి సిద్ధపడుతున్నాను. (అని ఖడ్గం పుచ్చుగుంటాడు)

చా—చంద్రగుప్తా చంద్రగుప్త! అమాత్యరాక్షసుడు నిన్ను అనుగ్రహించాడు. నువ్వింక వర్ధిల్లుతావు!

చంద్ర—మహాప్రసాదం!

(నిపుణకుడు ఎ. ఎ. నించి వస్తాడు)

ని—(ఎ. ఎ. నించి వస్తూ)-(చాణక్యుడితో) అమాత్యా! భద్రభటుడూ భాగురాయణుడూ మలయకేతువుని బంధించి తెచ్చారు.

చా—నాతో కాదు చెప్పవలిసింది (రాక్షసుణ్ణి చూపించి) ఆయన్తో! ఆయనా అమాత్యులు! ఆయన చిత్తం.

రా—(తనలో) ఔరా! ఆజ్ఞలు ఇతడివి విన్నపాలు నావి! సరే. ఏంజేస్తాం! (పైకి) చంద్రగుప్త మహారాజా! నువ్వు ఎరుగుదువుగా! నేను మలయకేతుదగ్గిర కొన్నాళ్ళున్నసంగతీ! అతణ్ణి కాపాడు.

చంద్ర—(చాణక్యుడి కేసి చూస్తాడు)

చా—అమాత్యరాక్షసుడితో చంద్రగుప్తుడికి ప్రథమస్నేహం కలిగిన సమయం శుభప్రదం కావడం సమంజసం. ఒరే! భద్రభటభాగురాయణుల్తో ఇట్లా చెప్పు! చంద్రగుప్తమహారాజు, అమాత్యరాక్షసుడు కోరినమీాదట మలయకేతువుని క్షమించి రక్షించాడు. అదీకాక పర్వతేశ్వరుడి రాజ్యం మలయకేతువుకి ఇప్పించవలిసిందని ఆజ్ఞ ఇచ్చాడు. కాబట్టి, మీారు అట్లా చేసిరండి! అని.

ని—చిత్తం (అని ఎ. ఎ. కి వెళ్ళబోతాడు)

చా—ఒరే! ఉండు. అమాత్యరాక్షసు డంతవాడు తనకి మంత్రిగా లభించిన ఈ సుముహూర్త సమయంలో

చంద్రగుప్తమహారాజు సంతోషించి, చందనదాసుకి సర్వ నగర శ్రేష్ఠి–అనే పదవి ప్రసాదించాడని దుర్గపాలకుడితో చెప్పా. ఏనుగులూ గుర్రాలూ తప్ప తక్కిన చందనదాసు సంపద యావత్తూ తీసికెళ్ళి చందనదాసు ఇంటిదగ్గిర అప్ప గించ వలిసిందని చెప్పా.

ని—చిత్తం.

చంద్ర—(రాక్షసుడితో ఆలోచించినట్టు నటించి) ఒరీ! చారకృత్యాలు నిర్వహించిన వాళ్ళందరికీ మూడు నెల్ల జీతం పారితోషికంగా ఇచ్చెయ్య వలసిందిగా కోశాధికారికి ఆజ్ఞాపత్రం వస్తుందని సూచించు.

చా—చంద్రగుప్తా! నేను తలపెట్టింది, అయింది· నేను ఉంటాను! నీకు మారేమి కావాలి?

చంద్ర—గురుదేవా! శత్రునాశనం అయింది, సామ్రాజ్యం చేతికొచ్చి స్థిరపడి, ఒక స్థాయి కొచ్చింది. అమాత్య రాక్షసుడు నాకు మంత్రి అయాడు. మరేం కావాలి!

చా—(చెయ్యి యెత్తి) సర్వేషాం శుభం, సుఖం! స్వస్తి!!!




శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.